

ఆరవ ప్రపంచ యువజన విద్యార్థి మహోత్సవం పరిసమాప్తమైంది! ఎన్నడూ సమావేశం కానంత అత్యధిక సంఖ్యలో, భూగోళపు నలుమూలలనుంచి వచ్చిన యువజనులు ఇక్కడ సమావేశమైనారు. రెండు వారాలపాటు, వారిక్కడ పాటలు పాడారు, నృత్యాలు చేశారు, కళల్ని ప్రదర్శించారు, ఒకరి అభిప్రాయాలను ఇంకొకరు తెలుసుకున్నారు. వినోదించారు. ఈ మహత్తర యువజనోత్సవ ఘట్టాన్ని. వివిధ దేశాల యువజనులమధ్య శాంతి స్నేహాల ప్రవర్ధమానం చేసే యీ కథను. ప్రపంచమంతటా యీ యువక ప్రతినిధులు, రానున్న వారాలలో పదేపదే చెప్పుకుంటారు.

రానున్న "సోవియట్ భూమి" లో కూడా యీ కథ చెప్పబడుతుంది.

**మీ ప్రతికై త్వరపడండి!**



ఆరవ ప్రపంచ యువజనోత్సవానికి విచ్చేసిన భారతీయ ప్రతినిధివర్గ సభ్యులలో కొందరు, మాస్కో వీధిలో నృత్యం చేస్తున్నప్పుడు మాస్కో వాసులు సందర్శిస్తోన్న దృశ్యం

సంపుటి 8
సంచిక 16

# సోవియట్ భూమి

ఆగస్టు 25,
1957

భారత దేశంలోని సోవియట్ రాయబార కార్యాలయ సమాచార శాఖచే ప్రచురింపబడుతోన్న సచిత్ర పక్ష పత్రిక



## ఈ సంచికలో



### అట్టలపై చిత్రాలు

ముఖ చిత్రం : జపరోజీ నగరంలోని జపరోజిస్తాల్ మిల్లులలో, ప్రాయోగిక శిక్షణ పొందుతున్న యువ భారతీయ ఇంజనీర్లు. ఎడమనుంచి కుడికి : నారాయణ్, కర్మాగారపు ఉత్తమ లోహనిపుణుడు గ్రియోర్గీ పొమ్యాతుజ్, దాల్రాజ్.

మూడవ అట్ట : ఉత్సవావిష్కరణం వద్దనున్న సోవియట్ ప్రతినిధి వర్గం.

వెనుక అట్ట : నెర్ల్ నది ఒడ్డున వున్న ఇంటర్ సెషన్ చర్చి.

# మహత్తర ఘటనలు

భారత ప్రజలు భారత స్వాతంత్ర్య దినోత్సవాన్ని, 1857–1859 తిరుగుబాటు శతవార్షికోత్సవాన్ని, జరుపుకున్నాక పదిరోజుల తరవాత సోవియట్ భూమి యొక్క యీ సంచిక ప్రచురింపబడుతోంది. భారతీయుల చరిత్రలోని యీ రెండు మహత్తర ఘటనల గౌరవార్థం సోవియట్ ప్రజలుకూడా విస్తృతంగా ఉత్సవం జరిపారు. విదేశీ పీడనకు వ్యతిరేకంగా, తమ దేశ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకొరకు తమ భారతీయ సోదరుల వీరోచిత పోరాటంలో ముఖ్య ఘట్టాలుగా వీటిని సోవియట్ ప్రజలు పరిగణిస్తారు.

చాలమంది భావించేటట్టుగా 1857–1859 తిరుగుబాటు ప్రజల అండదండలులేని పితూరీ మాత్రమే కాదనీ, భారత దేశంలో తమ పరిపాలనను పునఃస్థాపించుకునేందుకు ఫ్యూడల్ రాజుల ప్రయత్నంమాత్రమే కాదనీ, సోవియట్ చరిత్రకారులు అభిప్రాయపడుతున్నారు. బ్రిటిష్ పరిపాలనపట్ల భారతీయ ప్రజల అసంతృప్తికి, యీ తిరుగుబాటు ప్రతిబింబమని వారు పరిగణిస్తారు.

ఈ స్వాతంత్ర్య పోరాటంలో ప్రజలు చేసిన త్యాగాలు వృథా కాలేదు. భారత దేశంలోని జాతీయ విముక్తి ఉద్యమాభివృద్ధిపైని, యితర ఆసియా దేశాల జాతీయ ఉద్యమాలపైని కూడా యీ తిరుగుబాటు గాఢమైన ప్రభావాన్ని ప్రసరింపజేసింది. ఒక శతాబ్దంలోపల యీ దేశాలలో చాలా భాగం తమ స్వాతంత్ర్యాన్ని సాధించుకుని, విదేశ పరిపాలనను తుదముట్టించాయి.

ప్రపంచ రంగంలో దేని ఫలితంగానైతే ఒక నూతనమైన మహత్తర శక్తి ఆవిర్భవించిందో, ప్రపంచశాంతిని దీక్షగా బలపర్చే వలన విధానాన్ని వ్యతిరేకించే ఒక మహత్తర శక్తి ఆవిర్భవించిందో ఆ భారత స్వాతంత్ర్య దశమ వార్షికోత్సవాన్ని, యీ రోజుల్లో ప్రపంచ ప్రజలు హర్షిస్తారు. భారతీయుల జీవితంలోని యీ రెండు మహత్తర ఘటనల గురించి సోవియట్ ప్రజల అభిప్రాయాలు, యీ సంచికలో వేరొకచోట పాఠకులు వివరంగా చదివి, తమ భారతీయ స్నేహితుల చరిత్రలో సోవియట్ ప్రజలు ఎందువల్ల అధికంగా ఆసక్తిని కనబర్చుతున్నారో గుర్తిస్తారు.

ఈ రోజుల్లోనే సోవియట్ ప్రజలు, సామ్యవాద దేశ ఆవిర్భావానికి కారణభూతమైన మహత్తర అక్టోబరు సామ్యవాద విప్లవం యొక్క 40 వార్షికోత్సవానికి సన్నాహాలు చేస్తున్నారు. యుద్ధనౌక అరోరా పేల్చిన శతఘ్ని ప్రపంచానికి మానవజాతి చరిత్రలో నవశకోదయాన్ని ప్రకటించిన ఆ మహత్తర నిశాసమయంనుండి సోవియట్ సమాజం సాధించిన పురోగమనాన్ని పాఠకులకు పరిచయం గావించడానికి యీ సమయం ఉచితమైనదని మేము భావిస్తున్నాము. ఈ లక్ష్యంతో, మేము యీ సంచిక మొదలుకొని, గత నలభై ఏళ్ళలో ప్రపంచంలోని ప్రథమ సామ్యవాద దేశం సాధించిన విజయాలను వివరించే రచనావళి ప్రచురణను ప్రారంభిస్తాము.

# గడచిన దారి

ఎల్. లాపిన్, ఎమ్. ఎస్‌సి. (చరిత్ర)

*రష్యాలో జరిగిన అక్టోబరు విప్లవం 40వ వార్షికోత్సవానికి సంబంధించిన రచనావళిని ఈ సంచికతో ప్రారంభిస్తున్నాము. యుద్ధనౌక అరోరా శతఘ్నిని పేల్చి, ప్రపంచానికి మానవజాతి చరిత్రలో నవ శకారంభాన్ని ప్రకటించిన ఆ మహా రాత్రి నుండి మా సమాజం సాధించిన పురోగతిని పాఠకులకు తెలియచేయడమే, మా లక్ష్యం.*

రష్యాలో విప్లవం ఎందుకు జరిగింది—అన్న ప్రశ్నకు జవాబు చెప్పేందుకు, జారిస్టు రష్యాలో ప్రజలెలా జీవించేవారన్న విషయాన్ని సూక్ష్మంగానైనా, కాస్త వెనుకకు వెళ్ళి చెప్పక తప్పదు. పారిశ్రామికాభివృద్ధిలో రష్యా, యితర దేశాలకు వెనకబడింది. దాని జనాభాలో సుమారు మూడింట రెండువంతులు రైతులు. ఇందువల్ల, శ్రామిక ప్రజలు జీవించిన పరిస్థితుల గురించి చెప్పాలంటే, రైతాంగంతో మొదలుపెట్టాలి.

## జారిస్టు రష్యాలో రైతుల జీవితం

బానిస విధానం రద్దుచేయబడిన సంవత్సరమైన 1861 వరకూ భూస్వాముల అధీనంలో భూములే కాకుండా, రైతులుకూడా వుండేవారు; యీ రైతులను అమ్మివేయవచ్చును, కొనవచ్చును. భూస్వాముల ప్రయోజనాలను జారిస్టు పరిపాలన పరిరక్షించేది. భూస్వాముల, జారిస్టుఅధికారుల క్రూరమైన పీడన రైతులలో అసంతృప్తిని రేకెత్తించింది, తిరుగుబాటును రెచ్చగొట్టింది. ఈ తిరుగుబాట్లు—వీటన్నిట్లోకీ పెద్దది, 18వ శతాబ్దంలో ఎమెల్యాన్ పుగొఛొవ్ నాయకత్వాన జరిగిన తిరుగుబాటు—జారిజంచే క్రూరంగా అణచివేయ బడింది.

ఫ్యూడల్ వ్యవస్థ, రష్యా అభివృద్ధిని నిరోధించింది. పరిశ్రమ చాలా మందగమనంతో వృద్ధి చెందింది. తమ అధీనంలో చవకగా లభించే పనివారుండడంవల్ల, భూస్వాములకు వ్యవసాయంలో ఉత్పత్తి పద్ధతులను పెంపొందించే ఆసక్తి ఎంతమాత్రమూ వుండేది కాదు.

ఒక ఆర్థిక సంక్షోభంవల్లనూ, రైతులలో విప్లవోద్యమం అభివృద్ధి చెందడంవల్లనూ బానిస విధానం రద్దు చేయబడింది. కాని భూముల్లో ప్రధానభాగం భూస్వాముల చేతుల్లోనూ, జారు చేతుల్లోనూ వుండిపోయింది. కోటికిపైగా రైతు కుటుంబాలకు ఏడున్నరకోట్ల దెసియతినెస్ భూమి వుండేది (ఒక దెసియతినె = 2.7 ఎకరాలు) కాని ముప్ఫయివేల మంది భూస్వాములకు ఏడుకోట్ల దెసియతినెస్ భూమి వుండేది. రైతులకు బయళ్ళు, అడవులు, పచ్చికబయళ్ళు ఇవ్వబడేవికావు. వారి యిళ్ళకు చుట్టూరా భూస్వాముల భూమి వుండేది. "కోడి నడవడానికైనా జాగాలేదు"అని అంటూ వుండేవారు రైతులు. కాని రైతులు ఈ పాడుభూములకు ఇంచుమించు 200 కోట్ల రూబుళ్ళు ముదరా యిచ్చుకోవలసి వచ్చేది, వాటి విలువ 65 కోట్లకు మించకపోయినప్పటికీ. ఈ విధంగా జారు, భూస్వాములూ రైతులను కొల్లగొట్టారు.

రైతులలో అధికభాగం క్షేత్రం యంత్రాలను సంపాదించుకోలేక పోయేవారు. వారు భూమిని చేతితో చేసిన కర్ర నాగళ్ళతో దున్నేవారు; భూస్వాముల గొంతెమ్మ కోరికలను యీడేర్చడానికి యెంత మాత్రమూ అవకాశం ఇవ్వని అతిస్వల్పమైన పంటను పండించేవారు. రష్యన్ గ్రామసీమలు దారిద్ర్యావస్థలో కూరుకపోయాయి, రైతులు నాశనమైపోయి, ఆ భూస్వామి వద్దనే కూలికి కుదురుకోవడమో, లేకపోతే పనికోసం బస్తీకి వెళ్ళిపోవడమో చేసేవారు.

## కార్మికుల పరిస్థితులు

1890 చివరను ముప్ఫయి లక్షల మంది కార్మికులు రష్యాలో ఫ్యాక్టరీలలోనూ, గనులలోనూ, రైల్వేలలోనూ శ్రమపడేవారు. పనిరోజు 12.5—14 గంటలు. వారికి చాలా తక్కువ కూలి వచ్చేది. పెట్టుబడిదారులు విస్తారంగా స్త్రీలనూ, పిల్లలనూ పనిలో పెట్టుకునేవారు. వీరికైతే తక్కువ కూలీతో సరిపుచ్చ వచ్చును. కాస్తంత పొరపాటు జరిగితే కార్మికుల మీద జరిమానాలు పడేవి. కిక్కిరిసి వున్న బేరక్స్‌లోగాని, అద్దె కొంపల్లోగాని వారు వుంటూ వుండేవారు. 1902 లో కార్మికులలో జరిగిన అలజడుల సందర్భంలో అన్వేషణను జరిపిన ఒక జారిస్టు పోలీసు అధికారి సైతం, యీ విధంగా వ్రాయవలసి వచ్చింది: "తొమ్మిది భాగాలుగా విభాగింపబడిన చాలా చిన్న గదులలో 18 నుండి 24 మంది జీవిస్తారు; ప్రతిఒక్క భాగంలో పిల్లలతో ఒక కుటుంబం నిద్రిస్తుంది." రష్యాకు పొలిమేరల్లో వుండే కార్మికులు యింకా అధ్వాన్నంగా వుండేవారు. వారికి ప్రాథమికమైన రాజకీయ హక్కులు లేవు.

## వివిధ జాతుల ప్రజలెలా జీవించారు?

రష్యా పలుజాతుల దేశం. రష్యన్లు కాక అక్కడ యితర జాతులు పెద్దవీ, చిన్నవీ జీవిస్తూ వుండేవి, యిప్పుడుకూడా జీవిస్తూ వున్నాయి. స్థానిక ప్రభువుల అండతో జారిస్టు అధికారులు రష్యనేతర జాతులు నివసించే ప్రాంతాల అభివృద్ధిని నిరోధించడానికీ, ఫ్యూడల్ వ్యవస్థను అక్కడ అట్టె పెట్టడానికి, "విజాతీయుల"ను సులభంగా అదుపులో పెట్టేందుకు జాతులమధ్య శత్రుత్వాన్ని రెచ్చగొట్టడానికీ ప్రయత్నించారు.

జారిస్టు దుర్భర దాస్యాన్ని కూలద్రోయడానికి ప్రయత్నించిన పీడిత ప్రజలు, యీ వలస విధానానికి యెదురుదెబ్బ కొట్టారు. అశాంతినీ, తిరుగుబాట్లనూ అణచివేసేందుకు జారు, జాతుల ప్రాంతాలలో చాలా సేనలను వుంచాడు. అయినా జాతీయ విముక్తి ఉద్యమం



దేశంలో విస్తరిస్తూ వుండేది, దిట్టపడుతూ వుండేది, రష్యన్ శ్రామిక ప్రజల విప్లవ పోరాటంతో కలుస్తూ వుండేది.

## విప్లవ శక్తులను ఏకం గావించేందుకు కృషి

గత శతాబ్దం చివరను మార్క్సిస్టు బోధనలు రష్యాలోనికి చొచ్చుకపోతూ వుండడం మొదలైంది. జారిస్టు వ్యతిరేక పోరాటంకొరకు కార్మికవర్గం నాయకత్వాన శ్రామిక ప్రజలందరినీ ఐక్యం గావించే లక్ష్యం గల ఒక విప్లవకారుల బృందం, రష్యాలోని అప్పటి వ్యవస్థను మార్చదలచిన అభ్యుదయ కాముక బుద్ధిజీవుల నుండి ఉద్భవించింది. ఈ విప్లవకారులు రహస్యకేంద్రాలను



జారుల కాలంలో కార్మికుల జీవితం. త్రెఖొగొర్నయా బట్టలమిల్లు కార్మికుల పడకటింట్లు



రష్యాలో గ్రామం. ఈ గ్రామంలోని గుడిసెల కప్పులమీది గడ్డి పశుగ్రాసంగా ఉపయోగించబడింది (పైన)

జారుల కాలపు రష్యాలో భూవంపకం (స్కెచ్)

గని ముఖద్వారం దగ్గర (దిగువ)

ఏర్పరిచారు. దోపిడీ నుండి తమ విముక్తిని యెలా సాధించుకోవాలో వారు కార్మికులకు, యీ కేంద్రాలలో బోధించేవారు.

1895 లో కార్మికవర్గ విముక్తి సమర సంఘం, సెయింట్ పీటర్స్‌బర్గ్‌లో ఏర్పడింది. రష్యాలో మార్క్సిస్టు కార్మిక పక్ష భావి సంస్థాపకుడు, సామ్యవాద విప్లవనేత అయిన వ్లాదిమిర్ ఇల్యిచ్ లెనిన్, దానిని నడిపారు. ఇటువంటి సంఘాలే ఇతర నగరాల్లోకూడా వెలిశాయి. 1898లో వారు ఒక మహాసభలో సమావేశమై రష్యన్ సోషల్ డెమాక్రటిక్ కార్మికపార్టీ నిర్మాణాన్ని ప్రకటించారు. అయినా,





మహాసభ అనంతరం కూడా రష్యాలో మార్క్సిస్టు ఉద్యమం కొంత కాలంవరకూ చెల్లాచెదరుగా వుంది.

## రష్యాలో సామ్రాజ్య వాదం

ఇరవైయవ శతాబ్దారంభంలో, రష్యాలో పెట్టుబడిదారీ విధానం సామ్రాజ్యవాద దశలో ప్రవేశించింది. కార్మికులను రానురాను ఎక్కువగా దోపిడీ చేయడంద్వారా అధిక లాభాలను సంపాదించడానికి ప్రయత్నించిన పెట్టుబడిదారుల, బ్యాంకర్ల కూటాలు పుట్టాయి. రష్యాలో చవకగా లభించే శ్రమశక్తి, దాని అపార ప్రకృతి సంపదలను కొల్లగొట్టడానికిగల అవకాశాలూ, రష్యాకు విదేశీపెట్టుబడిని ఆకర్షించాయి. జారిజం దానిని తన ఛత్రచ్ఛాయల క్రిందికి తీసుకుంది. మొదటి ప్రపంచ యుద్ధ ప్రారంభం నరికి నూనెలో సగభాగమూ, బొగ్గుగనులలో సుమారు నాలుగింట మూడువంతులూ, ఇనుము, ఉక్కు, విద్యుత్ సాంకేతిక పరిశ్రమలూ బ్రిటిష్, ఫ్రెంచి, బెల్జియన్, జర్మన్ పరిశ్రమాధిపతులకూ, బ్యాంకర్లకు చెందివుండేవి సైనిక ఖర్చులు మొదలైన వాటికోసం జారిస్టు ప్రభుత్వం నానాటికీ ఎక్కువ తరచుగా విదేశ ఋణాలమీద ఆధారపడేది. ఋణాలమీద సాలు వడీ 40 కోట్ల బంగారు రూబుళ్ళ వరకూ వెళ్ళింది. రష్యా తన జాతీయ స్వాతంత్ర్యాన్ని కోలుపోయే ఘోరప్రమాదాన్ని ఎదుర్కొంది.

ఈ శతాబ్ద ప్రారంభాన జారిస్టు రష్యా, జర్మనీకి, దాని మిత్రరాజ్యాలకు వ్యతిరేకంగా ఉద్దేశింపబడిన సైనిక కూటమిలో ఫ్రాన్సు, ఇంగ్లండ్‌లతో కలసి ప్రవేశించింది. సామ్రాజ్యవాద క్రూరమృగాల పరస్పర విరుద్ధ ముఠాలు, వలసలనూ, మార్కెట్టులనూ మళ్ళీ పంపకం చేసుకునేందుకు యుద్ధ సన్నాహాలు సాగిస్తున్నాయి.

కొంతగా పారిశ్రామికాభివృద్ధి జరిగినప్పటికీ రష్యా వెనుకబడిన, వ్యావసాయిక దేశంగానే వుంటూవచ్చింది. దాని వెనుకబాటుతనం నానాటికీ పెరుగుతూనే వుంది. రష్యాలోని గుత్త పెట్టుబడిదారీ విధానం, ఫ్యూడలిజం అవశేషాలతో పెనవేసుకుని వుంది; వీటిలో ముఖ్యమైనది భూస్వాములు, జారిస్టు దుష్టపరిపాలన భూమి అట్టిపెట్టుకోవడం.

## జారును కూలద్రోయడానికి తొలిప్రయత్నం

జారు ఆజ్ఞానుసారంగా 1905, జనవరి 9న, సెయింట్ పీటర్స్ బర్గ్‌లోని జారిస్టు సేనలు, కార్మికులు శాంతియుతంగా చేస్తోన్న ఊరేగింపుమీద కాల్పులు జరిపారు. జారు తమ ఫిర్యాదులను వింటాడనీ, తమ దుర్భర జీవిత పరిస్థితుల భారాన్ని తగ్గిస్తాడనీ ఆశతో, వారు తమ భార్యాబిడ్డలతో బాటుగా రాజభవనంవేపు వెళ్ళారు. ఈ పైశాచిక సంహారం, ప్రజల సహనం హద్దునుదాటింది. మొదటి బూర్జువా ప్రజాస్వామిక విప్లవం ప్రారంభమైంది. కార్మికులు ప్రజలకు స్వాతంత్ర్యాన్ని, ఎనిమిది గంటల పనిరోజునూ కోరారు, రైతులు భూమినీ, తక్కువ పన్నులనూ కోరారు.

రష్యన్ బూర్జువావర్గం ప్రజావిప్లవం వస్తుందని భయపడ్డారు జారుతో ఒక ఒప్పందానికి రావడానికి ప్రయత్నించారు. శ్రామిక ప్రజల పోరాటానికి, 1903లో నిర్మింపబడిన మార్క్సిస్టు విప్లవ పక్షం నాయకత్వం వహించింది.

పెద్దపెట్టున సమ్మెలు దేశం అంతటా వ్యాపించాయి; ఫాక్టరీలు పనిచేయడం మానివేశాయి, రైళ్లాగిపోయాయి. చాలాచోట్ల



యుద్ధంలో విధ్వంసమైన ఒక గ్రామం

కార్మికులు సైనికులతోనూ, పోలీసులతోనూ సాయుధ పోరాటం చేశారు. చాల సోవియట్లు ఏర్పరుపబడ్డాయి. భావిలో ఏర్పడిన సోవియట్లవంటివే యివి. కాని 1907లో యీ విప్లవం అణచివేయబడింది. కార్మికులు, కర్షకులు తగినంత ఐకమత్యంతో పనిచేయలేదు. వారి కూటమి తగినంతగా అప్పటికి దృఢత్వాన్ని పొందలేదు. తనకు పెద్ద పెద్ద రుణాలను యిచ్చిన విదేశీ పెట్టుబడిదారులు జారుకు సాయపడ్డారు, విప్లవాన్ని అణచివెయ్యడంలో. జారు తలవరులు చాలా మంది విప్లవకారులను తుదముట్టించారు, యింకా వేలాదిమంది ప్రవాసానికి పంపబడ్డారు. అయినా, చాలా ఏళ్ళ తరవాత విప్లవ సమరం మళ్ళీ తలెత్తింది. కాని 1914లో మొదలైన సామ్రాజ్యవాద యుద్ధం దానికి తాత్కాలికంగా అంతరాయం కలిగించింది.

## దుష్పరిపాలన పతనం

ప్రపంచయుద్ధం. యుద్ధంలో పాల్గొన్న దేశాల ప్రజలకు అపారకష్టాలనూ, బాధలను తెచ్చిపెట్టింది. సైనికులతో కార్మికులు, కర్షకులు రష్యన్, బ్రిటిష్, ఫ్రెంచి సామ్రాజ్యవాదుల ప్రయోజనాల కొరకు పోరాడడానికి పంపబడ్డారు.

రష్యా తన మిత్రదేశాలమీద ఆధారపడింది. అప్పులమీద



సొలుకు అది వాటికి చెల్లించే వడ్డీలు మాత్రమే. రష్యన్ వార్షిక బడ్జెట్‌కు పైబడ్డాయి. రష్యా జాతీయార్థిక వ్యవస్థను నాశం చేసిన యుద్ధకష్టాలను భరించినది, శ్రామిక ప్రజలు. చాలినంతగా ముడి పదార్థాలూ, ఇంధనమూ లేకపోవడంవల్ల చాలా ఫ్యాక్టరీలు మూత బడ్డాయి. రైల్వే రవాణా కుంటుపడింది. ఆహార పదార్థాల విషయములో స్వెక్యులేషన్ దేశంలో హెచ్చిపోయింది. నగరాలలో కార్మికులు ఆకలితో బాధపడడం మొదలైంది. యుద్ధానికి వెళ్ళిన పురుషుల స్థానంలో పొలాల్లో పనిచేసిన గ్రామీణస్త్రీలు, పిల్లలు పొలంపనిని చేయలేక పోయారు. యుద్ధం, వినాశనమూ ప్రజల కోపాగ్నిని ప్రజ్వరిల్ల జేశాయి.

1917 ఫిబ్రవరిలో పెత్రోగ్రాడ్ కార్మికులు ఒక జనరల్ సమ్మె చేసి, "జారు నశించాలి!", "యుద్ధం నశించాలి!", "క్షుధార్తులకు రొట్టె కావాలి!" అన్న నినాదాలతో ప్రదర్శన చేశారు. సైనికులు కార్మికులపైని తుపాకులు కాల్చడానికి నిరాకరించి, సాయుధపాణులై వారి పక్షానికి వెళ్ళిపోవడం మొదలుపెట్టారు. ఈసారి విప్లవాన్ని తాను అణచివెయ్యలేనని గ్రహించి జారు తన రాజ్యాధికారాన్ని వదలి పెట్టాడు. దుష్టపరిపాలన కూలద్రోయబడింది.

విప్లవ ప్రారంభదినాలలో కార్మిక, సైనిక ప్రతినిధుల సోవియట్లు పెత్రోగ్రాడ్ మొదలైన నగరాలలో అవతరించడం మొదలైంది. అయినా, యీ సోవియట్లలో అధిక సంఖ్యాకులు, రాజీని కోరే పక్షాల ప్రతినిధులు. వారిసహాయంతో బూర్జువావర్గం ఒక తాత్కాలిక ప్రభుత్వాన్ని నెలకొల్పింది. ఇది త్వరలోనే జారిస్టు విధానాన్ని కొనసాగించే మార్గాన్ని చేపట్టింది. ఉదాహరణకు, అది విజయం లభించేవరకూ యుద్ధాన్ని సాగిస్తానని ప్రకటించింది. పెట్టుబడిదారులు తమ ఫ్యాక్టరీలను మూసివేసి, కార్మికులను వీధుల్లోకి తరుముతున్నారు, వినాశమూ, ఆకలి విప్లవాన్ని అణచివెయ్యడానికి తోడ్పడుతుందన్న ఆలోచనతో. రైతుల పరిస్థితులు కూడా బాగుపడ లేదు. వారికి భూమి లభించలేదు. శిక్షను విధించే దళాలు, ఎటువంటి అశాంతి చిహ్నాలు కనిపించినా అణచివెయ్యడానికి గ్రామసీమల్లోకి పంపబడ్డాయి. పూర్వపు జారిస్టు అధికారులు, స్థానిక భూస్వాములు ముందరివలెనే, జాతుల ప్రాంతాలలో అధికారాన్ని గుప్పెట్లో పెట్టుకు న్నారు.

యుద్ధాన్ని అంతం చేయడానికి ప్రజల పోరాటం, భూమికోసం రైతుల పోరాటంతోనూ, పెట్టుబడిదారీ దోపిడీకి వ్యతిరేకంగా కార్మికుల పోరాటంతోనూ, స్వేచ్ఛా సమానతలకొరకు పీడిత జాతుల పోరాటంతోనూ కలసి ఒకేఒక ప్రవాహంగా సాగింది.

## విప్లవ శాంతియుత పరిణామం కొరకు లెనినిస్టు పథకం

1917 ఏప్రిల్ 3వ తేదీన లెనిన్ నిర్బంధ పరిస్థితులలో వెళ్ళిన వలసలనుండి రష్యాకు తిరిగి వచ్చారు. పెత్రోగ్రాడ్ రైల్వే స్టేషన్‌లో ఆయనకు స్వాగత మివ్వడానికి వచ్చిన వేలాది కార్మికులు, సైనికులు, నావికుల నుద్దేశించి ఆయన ఉపన్యసించారు. జారును కూలద్రోయడంతో విప్లవం ఆగరాదని ఆయన అన్నారు. దేశంలో పెట్టుబడిదారులు, భూస్వాములు ఇంకా వున్నారు. ఫ్యాక్టరీలు, భూములు ఇంకా వారికే చెంది వున్నాయి, వాళ్ళు మునుపటి లాగనే శ్రామికులను దోచుకొంటున్నారు. సామ్రాజ్యవాద యుద్ధాన్ని ఇంకా కొనసాగించాలని వాళ్ళు కోరుతున్నారు. అధికారం వాళ్ళచేతిలో వుంటే రష్యన్ ప్రజల కష్టాలు గట్టెక్కవు. "సోషలిస్టు విప్లవం సదా వర్ధిల్లుగాక!" అని లెనిన్ ఉద్ఘాటించారు.

కార్మికులు, సైనికులు, రైతుల ప్రతినిధుల సోవియట్ల చేతుల్లో సర్వాధికారాలను కేంద్రీకృతం చేసి, ఆ సోవియట్లలో అధిక భాగాన్ని విప్లవం వైపుకు సుముఖంగా



స్మోల్నీలో వి. ఐ. లెనిన్



సోవియట్ అధికారాన్ని ప్రకటిస్తోన్న వి. ఐ. లెనిన్

చేసుకొనడం ద్వారా సోషలిస్టు విప్లవానికి శాంతియుత పరిణామాన్ని తీసుకురావడానికి తన పథకాన్నిలెనిన్ మర్నాడు తన పార్టీ కామ్రేడ్స్‌కు తెలియజేశారు. అదే లెనిన్ యొక్క ఏప్రిల్ సిద్ధాంతం. భూమిపై వ్యక్తిగత ఆధిపత్యం రద్దు, ఆ భూమిని రైతు కమిటీల హస్తగతం చేయడం, బ్యాంకుల నన్నింటిని ఏకంచేసి దేశానికంతటికీ ఒకే బ్యాంకును చేయడం, సాంఘికోత్పత్తిపైన, ఉత్పత్తి చేయబడిన వస్తువుల పంపకంపైన కంట్రోలు యేర్పాటు దానిలో పేర్కొనబడ్డాయి.

లెనిన్ ఈ సమయంలో తాత్కాలిక ప్రభుత్వాన్ని కూలద్రోయమని కోరలేదు. సోవియట్లలో అత్యధిక భాగాన్ని తనపక్షం త్రిప్పుకొనుటద్వారా, ఆ ప్రభుత్వాన్ని, అది అనుసరిస్తున్న జారు విధానం నుండి తప్పించడానికి వత్తిడి తేవాలని ప్రయత్నించారు.

ఏప్రిల్, జూన్ మాసాలలో పెట్రోగ్రాడ్‌లో శాంతియుతమైన ప్రజా ప్రదర్శనలు జరిగాయి. ఆ ప్రదర్శనలలో కార్మికులు, సైనికులు అధికారం యావత్తు సోవియట్ల హస్తగతం గావింపబడాలనీ, యుద్ధం అంతమొందింపబడాలనీ కోరారు.

## ప్రతి విప్లవశక్తుల దాడి

కాని తాత్కాలిక ప్రభుత్వం ప్రజల కోర్కెలను మన్నించలేదు. బ్రిటిష్, ఫ్రెంచి సామ్రాజ్యవాదుల ప్రోద్బలంతో సైనికులను రంగంలోకి దింపి దాడి జరిపించింది. కాని సైన్యాల చర్యలు పూర్తిగా విఫలమయ్యాయి, అనేకమంది ప్రజలు నిహతులు కావడానికి కారణభూతమయిందీ చర్య. దీనితో పెట్రోగ్రాడ్ కార్మికులు క్రోధపూరితులై పోయారు. వెంటనే నగరంలో ఒక ప్రజాప్రదర్శన జరిగింది. తాత్కాలిక ప్రభుత్వం ఆజ్ఞల ననుసరించి విప్లవ ప్రతిఘాతక సైన్యాలు ఆ ప్రదర్శనపై కాల్పులు జరిపాయి. విప్లవవాదులను అరెస్టు చేయడము, కార్మికులను నిరాయుధులను గావించడము ప్రారంభమయింది లెనిన్ అరెస్టుకు గూడా ఉత్తరువులు జారీ చేయబడ్డాయి. అందువల్ల ఆయన అజ్ఞాతవాసంలోకి పోవలసి వచ్చింది, తాత్కాలిక ప్రభుత్వము ప్రజల ముందు తన నిజస్వరూపంలో బయట పడింది. విప్లవం యొక్క శాంతియుత పరిణామానికి ఆటంకం కల్పింపబడ్డది.

రోజురోజుకు ప్రజల క్రోధం పెరిగిపోతూ వచ్చింది. తాత్కాలిక ప్రభుత్వం నుండి తమకు లభించబోయేదేమీ వుండదనీ, లెనిన్ యొక్క పార్టీ అయిన బోల్షివిక్ పార్టీయే తమ ప్రయోజనాలను కాపాడగలదనీ కార్మికులు, సైనికులు, పేద రైతులు గ్రహించారు. కేంద్రంలోను, స్థానికంగాను సోవియట్లు ప్రభుత్వంలో విశ్వాసాన్ని పూర్తిగా గోల్పోసాగాయి. అయినప్పటికి తాత్కాలిక ప్రభుత్వము తన స్థానాన్ని వదులుకోడానికి ఇష్టపడలేదు. దాని రోజులు పూర్తయ్యాయన్న విషయాన్ని గుర్తించదలచుకో లేదు.

## విప్లవం రానే వచ్చింది

1917 అక్టోబరులో లెనిన్ పెట్రోగ్రాడ్‌కు తిరిగి వచ్చారు. రెండురోజుల తర్వాత బోల్షివిక్ పార్టీ కేంద్రకమిటీ యొక్క చారిత్రాత్మక సమావేశం జరిగింది. సాధ్యమైనంత త్వరలో తిరుగుబాటును ప్రారంభించడానికి ఆ సమావేశంలో నిర్ణయం తీసుకొనబడింది కాని తాత్కాలిక ప్రభుత్వం కూడా ఊరికే కూర్చోలేదు. ఇంకా తన చెప్పుచేతల్లో వున్న సైనిక దళాలను పెట్రోగ్రాడ్‌కు పిలిపించి, తానే ముందుగా దాడిని ప్రారంభించింది అక్టోబరు 24వ తేదీ ఉదయం విప్లవ ప్రతిఘాతక సైన్యాలు ప్రభుత్వం ఉత్తరువుల ననుసరించి "కార్మిక పథం" అను పత్రిక ముద్రణాలయాన్ని ధ్వంసం చేయడానికి ప్రయత్నించాయి. కాని కార్మికులు, సైనికులు వారిని త్రిప్పి కొట్టారు తిరుగుబాటుకు యేర్పాట్లు జరిపిస్తున్న కేంద్రమైన పెట్రోగ్రాడ్ సోవియట్ కేంద్ర కార్యాలయం యొక్క భవనంచుట్టూ శ్రమిక ప్రజల సాయుధ దళాలు నిలుపబడ్డాయి. అల్ప సంఖ్యాకులుగా వుండడం మూలాన విప్లవ ప్రతిఘాతక సైన్యాలు, దాదాపు ప్రతిఘటించకుండానే ఒక్కొక్క స్థావరాన్ని విడిచివెళ్ళి తాత్కాలిక ప్రభుత్వం తల దాచుకొన్న వింటర్ ప్యాలస్ దగ్గరకు చేరుకున్నాయి. వింటర్ ప్యాలస్‌ను కాపాడడానికి పూనుకొన్న చిట్టచివరివారు సైనిక విద్యార్థులు, స్త్రీలదళం వారు పరిస్థితులు తిరుగుబాటుదార్లకే సుముఖంగా వున్నాయి. కాని అనవసర రక్తపాతాన్ని ఆపేందుకొరకై తాత్కాలిక ప్రభుత్వాన్ని లొంగిపొమ్మని రెండు పర్యాయాలు కోరడం జరిగింది.

కాని తాత్కాలిక ప్రభుత్వం అందుకు అంగీకరించ లేదు. అప్పుడు విప్లవాత్మక యుద్ధనావ "అరోరా" తుపాకులను పేల్చి వింటర్ ప్యాలస్‌పై దాడికి శంఖారావం జరిపింది.

అక్టోబరు 26వ తేదిరాత్రి వింటర్ ప్యాలస్ ఆక్రమించుకొనబడి, తాత్కాలిక ప్రభుత్వం కూలద్రోయబడింది.

## సోవియట్ పరిపాలన ప్రజలకు శాంతిని, స్వాతంత్ర్యాన్ని చేకూర్చింది

అధికారం పెట్రోగ్రాడ్ సోవియట్ హస్తగతం అయిన అక్టోబరు 25వ తేది రాత్రి (కొత్త పద్ధతి ప్రకారం నవంబరు 7వ తేది), అఖిల రష్యన్ సోవియట్ల ద్వితీయ మహాసభ స్మోల్నీలో ప్రారంభమయింది. దేశం అన్ని ప్రాంతాలనుండి, యుద్ధరంగాలనుండి కూడా ప్రతినిధులు ఆ సమావేశానికి వచ్చారు. "కార్మికులు, సైనికులు, రైతులలోని అత్యధిక సంఖ్యాకుల అభిలాష ననుసరించి, పెట్రోగ్రాడ్‌లో జరిగిన విజయవంతమైన తిరుగుబాటును ఆధారంగా చేసుకొని" తాను రాజ్యాధికారాన్ని హస్తగతం చేసుకొంటున్నట్లు ఆ మహాసభ ప్రకటించింది.

లెనిన్ ఇచ్చిన నివేదిక ననుసరించి మహాసభ అక్టోబరు 26వ తేదీన శాంతికి, భూమికి సంబంధించిన అధికార ప్రకటనలను చేసింది. యుద్ధం చేస్తున్న దేశాలన్నీ వెంటనే సమస్త సైనిక చర్యలను ఆపివేసి, సమానత్వం, అన్ని జాతులకు సర్వసత్తాధికారం, స్వాతంత్ర్యం అన్న ప్రాతిపదికమీద శాంతి ఒడంబడికకు సంప్రదింపులు ప్రారంభించమని కోరింది. శాంతికి సంబంధించిన ప్రకటన.

ఈ విధంగా, విప్లవం విజయవంతమైన మరునాటినుంచీ సోవియట్ రష్యా దేశాల మధ్య శాంతి స్నేహాలను చేకూర్చే విధానాన్ని అవలంబిస్తూవచ్చింది. అప్పటినుంచి, క్రమం తప్పకుండా ఇదే విధానాన్ని అవలంబిస్తున్నది సోవియట్ ప్రభుత్వం.

భూమికి సంబంధించిన ప్రకటన, భూమిపై వ్యక్తిగత ఆధిపత్యం అదిమొదలుకొని రద్దుగావింపబడిందనీ, దున్నేవారికే, అనగా రైతులకే భూమి ఉచితంగా ఇవ్వబడుతుందనీ తెలియజేసింది. 150,000 000 డెసియాతీనీల భూమి ఇవ్వబడింది. ఏటేటా వారు భూస్వాములకు ఇస్తూవుండిన సాలువారి శిస్తు ఇవ్వనవసరం లేకుండా చేయబడింది ఈవిధంగా వారు యేటేటా 700 000 000 బంగారు రూబుళ్ళను చెల్లిస్తుండేవారు. భూమికి సంబంధించిన ఈ అధికార ప్రకటనతో, శ్రమిక రైతులు కలకాలంగా కంటున్న కలలు నిజమయ్యాయి.

మానవ చరిత్రలో ప్రథమ పర్యాయంగా, లెనిన్ నాయకత్వములో కార్మిక కర్షక ప్రభుత్వాన్ని సోవియట్ ప్రభుత్వాన్ని మహాసభ యేర్పాటుచేసింది. దేశమంతటా సోవియట్ ప్రభుత్వాన్ని విస్తరింపజేయడానికి, దానియొక్క ప్రకటనలను అమలుపర్చడానికీ ప్రతినిధులు దేశం నలుమూలలకు వెళ్ళారు.

# అభ్యుదయం

1957 మొదటి భాగం ముగియడంతో, ఆ ఆరుమాసాల ఫలితాలను పరిశీలించడం సాధ్యమవుతున్నది. ఇవి సోవియట్ ప్రజలకు ఏవిధంగా లాభాన్ని చేకూర్చాయి ? 1957 మొదటి అర్ధభాగంలో సోవియట్ దేశ ప్రభుత్వ జాతీయార్థిక ప్రణాళిక పరిపూర్ణ ఫలితాల గురించి కేంద్ర స్టాటిస్టికల్ బోర్డు ప్రచురించిన నివేదికలో దీనిని చూడవచ్చును

అనేక టేబుల్స్, జాబితాలు, అంకెలూ అన్నింటినీ పునరుల్లేఖించ నక్కరలేదు. కాని కొన్ని ముఖ్యసంఖ్యలను పేర్కొనవలసి వుంటుంది. సాధించిన ప్రగతిని గురించి కొంతగా తెలియజేస్తాయి గాబట్టి.

* * *

సమీక్షింపబడుతోన్న ఆరు మాసాలలో పారిశ్రామికోత్పత్తి (1956 మొదటి అర్ధభాగంతో సరిపోల్చినట్టయితే) నూటికి పదివంతులు హెచ్చింది.

1957 తొలిఅర్ధభాగంలో ఉక్కు ఉత్పత్తి 1956 తొలి అర్ధభాగంలోకంటె ఒక మిలియన్ టన్నులు హెచ్చింది; యిదేకాలంలో నూనె ఉత్పత్తి 6.8 మిలియన్ల టన్నులు, బొగ్గు 17 మిలియన్ల టన్నులు హెచ్చాయి. (సోవియట్ దేశంలో 1957 తొలి అర్ధభాగములో ఉత్పత్తి చేయబడిన మొత్తం 25 మిలియను టన్నుల ఉక్కు 46.2 మిలియన్ టన్నుల నూనె, 226 మిలియన్ టన్నుల బొగ్గు). యంత్రాల విషయం. గత ఏడాది తొలి అర్ధభాగంతో సరిపోల్చినట్టయితే, యీ సంవత్సరం యిదేకాలంలో పరిశ్రమ 15 400 ఎక్కువగా ట్రాక్టర్లనూ, 21 000 ఎక్కువగా ధాన్యం కోతయంత్రాలనూ, 18 000 ఎక్కువగా ఆటోమోబైళ్ళనూ తయారుచేసింది.

ఇంజినీరింగ్ పరిశ్రమ యితర శాఖల్లో కూడా మంచి అభివృద్ధి వచ్చింది. దీని ఫలితంగా ఎక్కువగానూ, వివిధంగానూ బట్టలూ, జోళ్ళు, గృహోపయోగవస్తువులు, తయారు చేయబడిన తదితర జీవిత వినియోగవస్తువులూ ఉత్పత్తి చేయబడతాయి.

1957లో శక్తివంతమైన కొత్త పరిశ్రమలు చాలా ప్రారంభింపబడ్డాయి పాతవి అభివృద్ధి చేయబడి ఆధునికం గావింపబడ్డాయి. కొత్త బ్లాస్ట్ ఫర్నేస్‌లు యిప్పటికే ఉక్రెయిన్లో లోహాన్ని తయారు చేయడం మొదలు పెట్టాయి. యూరల్స్, కజాఖస్‌లలోని ఓపెన్ హార్త్ ఫర్నేస్‌లు కూడా యిదేవిధంగా చేస్తున్నాయి. మూడు సిమెంట్ ఫాక్టరీలు కూడా పనిచేయడం ప్రారంభించాయి. ఓల్గాపైనున్న బ్రహ్మాండ

# సిరి సంపదలు

మైన క్యుబిషేవ్ విద్యుత్కేంద్రంతోబాటుగా చాలా విద్యుత్కేంద్రాలలో కొత్త టర్బయిన్లు నడిపింపబడుతున్నాయి. బట్టల మిల్లుల లోను, జోళ్ళఫాక్టరీలలోనూ, ఆహార పరిశ్రమలోనూ కొత్త మిషిను యూనిట్లు పనిచేస్తున్నాయి.

ఈ అభివృద్ధికి ఎక్కువగా కారణమైన యింకో హంశం, ఉత్పత్తి యాంత్రికీకరణ, స్వయంచోదన, సామ్యవాద ఆర్థిక వ్యవస్థలో యీ చర్యలు నిరుద్యోగానికి దారితీయకపోవడం, చోద్యమైన విషయం, దేశంలో పనిచేస్తోన్న కార్మికుల సంఖ్య క్రమక్రమముగా పెరుగుతూ వుండడాన్నిబట్టి దీనిని తెలుసుకోవచ్చును. 1957 తొలి అర్ధభాగం అంతంలో, 1956 తొలి అర్ధభాగంతో పోల్చితే, పనులలోవున్న జనాభా 2,100,000 మంది పెరిగింది. 3,600,000 మంది జీతాలు, వేతనాలు పుచ్చుకునే పనివారు యీ ఏడాది తమ నైపుణ్యాన్ని వృద్ధిచేసుకున్నారన్న విషయం గమనార్హం: అంటే వారికి ఎక్కువ వేతనాలు వస్తాయన్నమాట.

వ్యవసాయంలో యిటువంటి అభివృద్ధే సాధింపబడింది. సోవియట్ దేశంలోని ముఖ్య ధాన్యమైన గోధుమ పండే ప్రాంతంలో, యీ ఏడాది 18.5 మిలియన్ల ఎకరాలు చేరాయి. అమెరికాతో సరిపోల్చి, యీ అభివృద్ధిని నిర్ణయించవచ్చును.

పెట్టుబడిదారీ ప్రపంచంలో గోధుమ సరఫరాకు ముఖ్యదేశమైన అమెరికాలో, గోధుమ పంటక్రింద సుమారు 50 మిలియన్ల ఎకరాలున్నాయి. ఒక్క ఏడాదిలోనే సోవియట్ దేశం తన గోధుమ పొలాలకు, అమెరికాలో గోధుమపంట క్రిందనున్న ప్రదేశంలో మూడింట ఒకటవ వంతుకు పైగా ప్రదేశాన్ని చేర్చిందని యిది తెలియజేస్తుంది. మొత్తంగా సోవియట్ దేశానికి గోధుమ పంటక్రింద 172 మిలియన్ల ఎకరాలున్నాయి.

సోవియట్ దేశపు అంతర్భాగంలోని—సైబీరియా, ఉత్తర కజాకస్ ప్రాంతాలలోని—బీళ్ళను సాగుక్రిందికి తీసుకరావడంద్వారా పంట భూములకు 94 మిలియన్ల ఎకరాలు చేర్చబడ్డాయన్న విషయాన్ని జ్ఞాపకం పెట్టుకున్నట్టయితే యిది అసాధారణమైన విషయమేమీకాదు.

ధాన్యం ఉత్పత్తిలోని పెరుగుదలతో బాటుగా, పశు ప్రజననం కూడా హెచ్చింది. 1957 మొదటి అర్ధభాగంలో (1956 లోని యిదే కాలంతో సరిపోల్చినట్టయితే) పాల పశువుల మందల్లో, మూడు మిలియన్ల పశువులు యెక్కువయ్యాయి; గొర్రెలు, మేకలు సమిష్టి క్షేత్రాలలోనూ, ప్రభుత్వ క్షేత్రాలలోనూ యించుమించుగా ఐదు మిలియన్లు హెచ్చాయి. ఈ అంకెల్లో వ్యక్తిగతంగా పౌరులకుగల పశువులు చేర్చబడలేదు. ఇది సహజంగా పాల ఉత్పత్తిని హెచ్చించింది, తల ఒక్కింటికి లెక్కలో మాంసం, పాలు, వెన్న ఉత్పత్తిలో, అమెరికాతో సూక్ష్మకాలంలో సరిసమానం కావడానికి, యీ విధంగా ఒక పెద్ద ముందడుగు వేయబడింది.

సమీక్షింపబడుతోన్న కాలంలో జీవన ప్రమాణం పెరిగింది. తమ ఆదాయాలు కాక సోవియట్‌దేశ పౌరులకు వివిధ ప్రభుత్వ *సౌకర్యాలు, అవకాశాలు రూపంలో సుమారు లక్ష మిలియన్ల రూబుళ్లు* లభించాయని స్టాటిస్టికల్ బోర్డు నివేదికలో ప్రత్యేకంగా పేర్కొనబడింది.

దీనిలో, గత సంవత్సరంనిర్ణయింపబడిన ప్రభుత్వ పెన్షన్లలోనూ, ఫాక్టరీ, ఆఫీసు పనివారిలోని తక్కువ జీతాల తరగతులకు చెందిన వారి జీతాలలోనూ, వేతనాలలోనూ పెరుగుదల, ఆదాయపు పన్నులనుండి మినహాయింపులు (ముందుకంటె యిప్పుడు ఎక్కువ జీతాల తరగతులవారిపైని విధింపబడుతున్నాయి), తదితర ప్రభుత్వ సౌకర్యాలూ వున్నాయి. ప్రభుత్వానికి వ్యవసాయవస్తువులను విధిగా యివ్వాలి అన్న నియమంనుండి రైతుకుటుంబాల మడులనూ పారిశ్రామిక కార్మికులూ, తదితర ఉద్యోగులు నిర్వహించే మడులనూ మినహాయించడానికి యిటీవలనే ఒక నిర్ణయం చేయబడింది.

కొన్ని అంకెలను చూద్దాం. సోవియట్ దేశంలో యిరవై కోట్లకు పైగా జనాభావుంది. లక్ష మిలియన్ల రూబుళ్ళను జనాభాతో భాగారించినట్టయితే, మనిషి ఒక్కింటికి 500 రూబుళ్లు వస్తుంది (పిల్లలతో కలిపి; యిది నిపుణుడైన కార్మికుని సగటు పక్ష వేతనం. ఇది కుటుంబానికి మంచి అదనపు ఆదాయం.

* * *

ఇళ్ళ సమస్య తీవ్రత కూడా తగ్గింది. ఈ ఏడాది మొదటి అర్ధభాగంలో ప్రభుత్వ వ్యయంతో తొమ్మిది మిలియన్ల చదరపు మీటర్ల నివాసస్థలానికి పైగా జాగాలో యిళ్ళు నిర్మింపబడ్డాయి. అంటే జనాభాకు సుమారు 750,000—1,000,000 గదులు లభించాయన్నమాట.

నివేదిక ప్రకారం, చాలా రంగాలలో అధికంగా అభివృద్ధి సాధింపబడినప్పటికీ, వెనుకబడే పరిశ్రమలూ, తక్కినవాటిని కూడా వెనుకకులాగే పరిశ్రమలూ కూడా వున్నాయి. సంవత్సరం రెండో అర్ధభాగంలో దీనికి యివి కలుపుకోవలసి వుంటుంది. అయినా, మొత్తంమీద యదార్ధవిషయాలూ, అంకెలూ ఆశాజనకంగావున్నాయి. ప్రణాళికాబద్ధమైన సామ్యవాద ఆర్థిక వ్యవస్థ చాలా పెద్ద ముందడుగు వేసింది. ఇటీవల జరిగిన పారిశ్రామిక నిర్వహణ పునర్నిర్మాణం, ఫలప్రదంకావడం మొదలైంది.

సోవియట్ దేశం అనుసరించే ఆర్థిక విధాన సాధారణ మార్గం సరైనదని, భారీపరిశ్రమను ముందుగా అభివృద్ధి గావించి, దానిద్వారా జాతీయార్ధిక శాఖలన్నిటికీ ప్రోత్సాహాన్నిచ్చే మార్గం సరైనదని, యీ యదార్ధ విషయాలు రుజువుచేస్తున్నాయి. వ్యవసాయ ఉత్పత్తిలో పెద్ద హెచ్చుదలనూ, సోవియట్ ప్రజల జీవన, సాంస్కృతిక ప్రమాణాలలో మంచి అభివృద్ధినీ యిది తీసుకవస్తుంది.

# సోవియట్ దేశ …

## ప్రజా …



ప్రదర్శన ప్రధాన మండప దృశ్యం

సోవియట్ వ్యవసాయ మహత్తర పురోగతిని గురించి. యీ సంచిక ముందర పుటలలో పాఠక మహాశయులు చదివే వుంటారు. మాస్కోలోని సోవియట్ దేశ వ్యవసాయ ప్రదర్శనం సమిష్టి క్షేత్రాల ప్రభుత్వ క్షేత్రాల ప్రముఖమైన ఫలితాలను ప్రదర్శించడం మాత్రమేకాకుండా, యిది పెద్ద విద్యాలయంకూడా. దీనిలో వ్యవసాయశాస్త్రజ్ఞులు, వ్యవసాయదారులు, రైతులు, మెషీన్ట్రాక్టరు స్టేషన్ ప్రముఖులు తమపనిలో ఉపయోగించుకునేందుకు అమూల్యమైన అనుభవాన్ని గడిస్తారు. ఈ కారణంవల్ల సోవియట్ దేశ వ్యవసాయ ప్రదర్శనాన్ని, ప్రజా విశ్వవిద్యాలయ మంటారు.

గత మూడేళ్ళలో, మాస్కోలోని సోవియట్ దేశ వ్యవసాయ ప్రదర్శనాన్ని, రెండుకోట్ల ఏభై లక్షలమంది చూశారు. దీనికి 3,835 విదేశ ప్రతినిధి వర్గాలుకూడా వచ్చాయి. ఈ చక్కని వాస్తుశిల్ప సముదాయాన్ని చూసే అవకాశం మాత్రమే కాకుండా ప్రదర్శనంలో ప్రాతినిధ్యంగల అన్ని సోవియట్ రిపబ్లిక్కుల ఆర్థిక, సాంస్కృతిక విజయాలను పరిచయం గావించుకునే అవకాశంకూడా వారికి లభించింది.

సోవియట్ దేశం అంతట్నుండి వ్యవసాయానుభవంలోని శేటను ఏర్చికూర్చి పెట్టినది, ఈ ప్రదర్శనం. ప్రదర్శనక్షేత్రాలూ, అతి



తుర్కమెన్ సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్ విభాగ ప్రదర్శనలో పాల్గొంటున్నవారు

ప్రదర్శన కేంద్ర దృశ్య…



# వ్యవసాయ ప్రదర్శన విశ్వవిద్యాలయం

విలేఖరి ✧



సైబీరియా ప్రదర్శన విభాగం

భిన్నమైన రకాల పళ్ళచెట్లుగల తోటలూ, ఉద్యానకృషిలో అద్భుత ప్రతిభాశాలియైన ఐ. వి. మిఛురిన్ రచనలు ఉన్నాయి. మేలుజాతి పశువులుగల నమూనా పశువులశాలలూ, ఒక్క పశువైద్య కేంద్రం, మెషీన్ ట్రాక్టర్ స్టేషన్ వ్యవసాయ విజ్ఞానశాస్త్ర గృహమూ అక్కడ వున్నాయి. అయినా, ముఖ్య విషయం ప్రజలు అన్నిట్లోనూ చాలా విలువైన విషయం ప్రేక్షకులకూ, వ్యవసాయంలో నవ్యమార్గదర్శులైన ప్రదర్శనలలో పాల్గొన్నవారికీ మధ్య జరిగిన సమావేశాలు.

సోవియట్ దేశంలోని వివిధ భాషలలో మాటాడుతూ వెళతోన్న ప్రజాప్రవాహంలో చేరి ప్రదర్శనంలోని ముఖ్యశాలకు మనమూ వెళ్దాం. ఆ ప్రదేశంలోని అన్ని భవనాలనూ మించివుంది దాని శిఖరం.

ఈ ఏడాది ప్రదర్శనంలో సోవియట్ ప్రజల దృష్టిని ఆకర్షించే దేమిటి?

ఈ ప్రశ్నకు ముఖ్య ప్రదర్శనశాల జవాబు నిస్తుంది. ఒక గైడ్ యీ విధంగా ఫిర్యాదు చేశాడు:

"పంటలు, పశువులద్వారా వచ్చిన వస్తువులకు సంబంధించిన ప్రదర్శితవస్తువుల విషయంలో. ప్రతిఏడూ యీ ప్రదర్శనం ఎక్కువ కష్టమైన కోరికలూ, పెద్దకోరికలూ కోరుతోంది. అయినప్పటికీ ప్రతి ఏడాదీ వ్యవసాయంలోని ఉత్తములైన కార్మికులు ఎక్కువ మందికి ప్రదర్శనంలో పాల్గొనే అవకాశం కలిగింపబడుతోంది. సోవియట్ రైతుల నైపుణ్యాభివృద్ధికీ, వారి సమిష్టి వ్యవసాయ ఆర్థిక విధానపుష్టికీ యిది తార్కాణం.

"1957లో 7 యూనియన్ రిపబ్లిక్కులు, 39 మండలాలూ, ప్రాంతాలూ ప్రదర్శనంలో పాల్గొన్నాయి. వ్యవసాయంలోని అగ్రశ్రేణి కార్మికులు నాలుగు లక్షల మంది ప్రదర్శనంలో పాల్గొనే హక్కును సంపాదించుకున్నారు. మొదటి ఏడాదిలో పాల్గొన్నవారి సంఖ్యకంటె యిది రెట్టింపు."



ప్రదర్శనను సందర్శించి, తమ అనుభవాన్ని సుసంపన్నం చేసుకోవడానికని ఈ యాత్రికులు, దూరస్థమైన కకేషియన్ పర్వత ప్రాంతాల నుంచి వచ్చారు

ఛాయా చిత్రకారుడు: వా. శ్పెనర్‌స్కి





1957 ప్రదర్శనంలో పాల్గొన్నవాటిలో కజక్ రిపబ్లిక్ ఒకటి. దాని ప్రదర్శనశాల మమ్ములను ఆకర్షించింది. ప్రాచ్య దేశాల దిప్పటోపీని పోలి వున్న రంగురంగుల గోపురంతో ప్రాచ్యశైలిలో అది అందంగా అలంకరింపబడివుంది.



ఈ ప్రదర్శనశాల దర్శకుడు మక్సుద్ రుస్తెమోవ్, యీయన అనుభవజ్ఞుడైన కజక్ వ్యవసాయ శాస్త్రజ్ఞుడు. ప్రఖ్యాతమైన మాస్కో-తిమిర్యజెవ్ వ్యవసాయ పరిషత్తులో ఒకప్పుడీయన పట్టాన్ని పొందారు.

"మా రిపబ్లిక్కు-లోని 16 ప్రాంతాలలో" అంటూ మక్సుదే రుస్తెమోవ్ వివరించారు, "బీళ్ళనుసాగుచేయడంలో విజయాలను పొందినందుకు ప్రదర్శనంలో పాల్గొనే హక్కు-ను 14 పొందాయి. ఇవికాక, 90 పరిపాలనా జిల్లాలూ, 142 మెషీన్ ట్రాక్టరు స్టేషన్లు, 174 ప్రభుత్వ క్షేత్రాలూ, 368సమిష్టి క్షేత్రాలూ 4000 మంది అగ్రశ్రేణి వ్యవసాయ కార్మికులూ వ్యవసాయంలో పాల్గొంటున్నారు."



వందల కొలదీ కొత్త ప్రభుత్వ ధాన్య క్షేత్రాలూ, మెషీన్ ట్రాక్టరు స్టేషన్లూ, గత కొద్ది ఏళ్ళలో కజకస్తాన్ విశాలమైన స్టెప్పీలలో ఏర్పర్చినవి. గుర్తుపెట్టివున్న యీ రిపబ్లిక్కు- ఉబ్బెత్తు మ్యాపును ఆయన మాకు చూపారు, బీళ్ళను సాగులోపెట్టే ఉద్యమంలో శ్రేష్ఠతను గడించుకున్న వారి అనేక చిత్రాలను చూడమని ఆయన మాకు చెప్పారు. యువ్వనోత్సాహాలు వెల్లివిరిసే ముఖాలు! దేశములోని వివిధ జిల్లాల నుండి వచ్చిన యువకులు కజకస్తాన్ ధాన్యం రైతులతోబాటుగా, యీ మహోద్యమంలోని కష్టాలన్నిటినీ ఎదుర్కొ-న్నారు.



ప్రదర్శనానికి బీడుభూముల రైతులు పంపిన ఎంపికచేసిన బంగారు ధాన్యం రాసులు దగ్గర్లో





దళసరి-తోకవున్న తుర్క్-మెన్ గొర్రె (పైన)
పొస్టేలు నెం. 40 (మధ్య)
ప్రదర్శనావరణలో చూపబడిన సన్న ఉన్ని నిచ్చే
స్తవ్రాపోల్ గొర్రె (దిగువ)



వున్నాయి. గత ఏడాది యీ రిపబ్లిక్, క్రొత్త భూములు సాగుకావడంవల్ల, 1400 మిలియన్ల పూడ్ల ధాన్యాన్ని పండించి (23 మిలియన్ల టన్నులకు పైగా). గత పదకొండు ఏళ్లు కలిపి అమ్మిన దానికంటె ఎక్కువగా ధాన్యాన్ని ప్రభుత్వానికి అమ్మినదని తెలుసుకున్నాక, మేము వారి మహత్తర కృషిని స్పష్టంగా తెలుసుకున్నాము।

ప్రదర్శనలోని పశు క్షేత్రాలుకూడా కిక్కిరిసి పెరేడ్ సర్కిల్లోకూడా చూశాము. ఇక్కడ ఉత్తమమైన పశువులు ప్రదర్శింపబడి ఉన్నాయి.

“పెద్ద కొండలాగా వుంది, యీ ఉన్ని!” అన్నాడు ఒక ముసలి సమిష్టి రైతు, ఉక్రెయిన్లోని ఖెర్సన్ ప్రాంతపు క్రాస్ని ఖబన్ సమిష్టి క్షేత్రపు 40వ నెంబరు గొర్రె పొట్టేలును చూసి. సగర్వంగా ఆగి యీ ఉత్సవ వీరుడు తన కాపరి యాకోవ్ ఒనొప్రెంకోను అనుసరించింది. దాని గర్వం, సకారణమైనదే.





ఓర్లోవ్ గుర్రాలు కట్టబడిన త్రొయ్కా



వుంటాయి, ఎప్పుడూ. చాలామంది సమిష్టి రైతులు, వీరిలో చాలామంది పాల పనికత్తెలయి వుండవచ్చు, ప్రదర్శింపబడివున్న ష్పంకా అన్న ఆవు చుట్టూరా గుమిగూడి వున్నారు. మూడువందల రోజుల్లో యీ ప్రఖ్యాతమైన ఆవు 10,007 కిలోగ్రాముల పాలను యిచ్చింది. ఈ ఆవువద్ద పనిచేసే పనికత్తె అనుభవాన్ని తెలుసుకోవడానికి ఆతృతగా వున్న సమిష్టి రైతుల ప్రశ్నలన్నిటికీ జవాబు చెపుతూ ఆమె సతమతమవుతూ వుంది.

పశువులపట్ల ఉత్సాహం గలవారిని మేము ఈ పొట్టేలు ఒక ఏడాదిలో 30 కిలోగ్రాముల 600 గ్రాముల చక్కని ఉన్నిని యిచ్చింది. ఇది 20 మీటర్ల సర్జినీ, లేదా స్త్రీల దుస్తులకోసం 30 మీటర్ల ఉన్ని బట్టను తయారు చేయడానికి సరిపోతుంది.

ఇప్పుడొక “త్రొయ్కా” (మూడు గుర్రాల బండి) వచ్చింది. ఇది ఓర్లోవ్ ఆడ, మొగ గుర్రాల క్షేత్రానికి చెందినది. రష్యన్ జాతీయ

(మిగత 28వ పుటలో)

## ఆరవ ప్రపంచ యువజనోత్సవం

# మాస్కో మీదన



ప్రారంభోత్సవానికి పోతున్న భారత ప్రతినిధివర్గం.



ఉత్సవ ప్రతినిధులను అభినందిస్తోన్న మాస్కో వాసులు

స్నేహం చేసుకుంటూ



ఆ ఆదివారం మాస్కో దిఙ్మండలం మీద ఒక కొత్త చుక్క పొడిచింది. విచిత్ర మనిపించవచ్చు, దట్టంగా మబ్బుపట్టి, ఆకాశ మంతా నల్లకప్పువేసి, ఇతర చుక్కలేవీ కనుపించకున్నా యీ చుక్కమాత్రం స్పష్టంగా కనిపిస్తున్నది.

క్రెమ్లిన్ గోపురాలమీద ప్రకాశించే అరుణ తారలలోని ఒక తార కాదిది. పెట్టుబడిదారీ ప్రపంచంలో కొంతమందికిపీడకలయై వెన్నాడే విప్లవాన్ని రూపించే అరుణతార కూడా కాదిది.

నిజానికి ఇది ఒక కొత్త చుక్క కానేకాదు. మానవజాతి ఎంత ప్రాచీనమైనదో ఇది అంత పురాతనకాలపుది. కొన్ని కొన్ని సమయాలలో చరిత్రలో ఇది మరుగున పడింది. దురభిమానం, అవివేకం, అసూయ, యుద్ధ మేఘాలు దీనిని ఆచ్ఛాదించాయి.

యువజనోత్సవావిష్కరణానంతరం మాస్కో నగరంమీద చీకట్లు క్రమ్మి వుండగా, కృత్రిమంగా వెలిగింపబడిన, ఈ యువజనోత్సవపు చిహ్నం, ఆకాశానికి ఎగిరింది. నిజానికి ఇదొక నవ తారలా తోచింది, దిఙ్మండలం మీదికి ఎగిరింది. నాకేకాదు, యీ యువజనోత్సవ అవిష్కరణానికి విచ్చేసి, దీనిని సందర్శించ గలిగిన అదృష్టవంతులందరికీ ప్రపంచ యువజనులందరూ సమావేశమయిన యీ అపూర్వ చారిత్రక ఘటనకు అది ప్రతీకగా తోచింది.

### పతాకల పలుకులు

"దీని సారాంశమేమిటో మీరు నిర్వచించ గలరా? మాస్కో, యువజనోత్సవంయొక్క ప్రప్రధానమైన పాత్ర ఏమిటని మీరుఅభిప్రాయ పడుతున్నారు?" అని నన్ను తరచు అడుగుతుంటారు, నిజం చెప్పాలంటే, నాకు నేనే ఈ ప్రశ్న వేసుకున్నాను. ఈ ప్రశ్నకు జవాబు చెప్పడం అంత సులభంకాదు, ఒక్కగంటలో ఒక ఏడాదిపాటు నెమరువెయ్యడానికి వీలైనన్ని భావముద్రలుపడి. ఆలోచన సుదీర్ఘమైంది. నాకళ్లు, చూడగలిగినంత చూచాయి. కొత్తగా నాగుండెలు యవ్వనోద్వేగంతోకొట్టుకున్నాయి.

స్టేడియం ఉత్సవ వీధుల, వివిధ ప్రతినిధి వర్గాలు నడుస్తున్నప్పటి మహత్తర దృశ్యాన్ని, సోవియట్ ధ్వజధరులు సకల జాతుల, సకల దేశాల, పెద్ద, చిన్న రాజ్యాల, మిత్రదేశాల, అంత మైత్రిలేని దేశాల పతాకలనేకాదు, సోవియట్ దేశానికీ, సోషలిజానికీ బహిరంగ శత్రుదేశాల పతాకలసైతం నెగురవేస్తున్న దృశ్యాన్ని—అవిష్కరణోత్సవ సందర్శకులలో ఏఒక్కరూ, ఎన్నటికీ మరువలేరు. స్టేడియములో ఎగురుతున్న ఆ పతాకలు, ఇట్లా గుసగుస లాడుతున్నట్లనిపించింది :



లెనిన్ స్టేడియం దగ్గరి దృశ్యం

ఖ్వాజా అహమ్మద్ అబ్బాస్

# పనక్షత్రం ★



ఉత్సవం సదా వర్ధిల్లుగాత!

"చూడండి మావంక, చూడండి, అందరము ఈ గాలిలో, విభిన్నతలులేని ఈ వాతావరణంలో యెట్లా రెపరెపలాడుతున్నామో చూడండి—సోవియట్ దేశ పతాకతో ఎగురుతోంది అమెరికా పతాక, త్రివర్ణభారత పతాక స్పృశిస్తోంది పాకిస్తాన్ పతాకను, అరబ్ దేశాల పతాకల ప్రక్కనే ఎగురుతోంది ఇస్రాయిల్ పతాక, జర్మన్ డెమాక్రటిక్ రిపబ్లిక్ పతాక ప్రక్కనే ఎగురుతోంది జర్మన్ ఫెడరల్ రిపబ్లిక్ పతాక, మేమంతా ఇక్కడున్నాం, శోషల్కు, ధనస్వామ్య దేశాల పతాకలం, అగ్ర రాజ్యాల, చాలా అజ్ఞాత రాజ్యాల పతాకలం, మొనాకోలాంటి చిన్న దేశాల, ఏక రాజాధిపత్య దేశాల, రిపబ్లిక్ దేశాల, వివిధ మతాలకు చెందిన జాతుల, ఏ మతానికీ చెందని జాతుల ప్రతీకలం. ఏ ఒక్క పతాక మరొక దానికన్న పెద్దదికాదు, ఏఒక్క పతాక మరొక దానికన్న ఎత్తున ఎగరడంలేదు, ఏ ఒక్క వ్యక్తికి మరోవ్యక్తికి మించిన ప్రాముఖ్యం లేనట్టు, మాలో వున్న వ్యత్యాసమల్లా, మా రంగులలోనే, ఆకృతిలోనే: సహజంగా వివిధ ప్రజల వైఖరులలో, ఆకృతిలో, విశ్వాసాలలో, భావనలో వున్నట్టు సహజీవనం ఆచరణ యోగ్యమనేకాదు, ఇక్కడది ఆకృతి ధరించింది."

ఈజిప్షియన్ ప్రతినిధివర్గాగమనం



## చిరస్మరణీయమైన ఆతిథ్యము

నగరానికి ధమనికలవలె సాలంకృతమై వున్న ప్రధానవీధులనుండి దూరదూరంగా వున్న ఇరుకు సందులన్నీ పాదచారంగానే హాయిగా తిరిగొచ్చాను. మాస్కోలోని ప్రతి గృహమూ నాకు స్వాగత మిస్తున్నట్టుంది! యెక్కడ చూచినా పతాకలే, ఎక్కడ చూచినా ప్రకటన పత్రికలే. ఎక్కడ చూచినా నీటిస్ప్రింగులే, సుందరంగా అలంకరించబడిన షాపు కిటికీలు, మనోహరంగా వున్న రంగురంగుల దీపాలే. మాస్కో అంతటా నాకు, సకల భాషలలో ప్రకాశమానం ప్రసన్నంగా కనుపించింది "శాంతి" అన్న పదం.

దీపాలతో, పూలతో, పతాకలతోటే కాదు మాస్కో వాసులు అతిథులకు స్వాగతం చెప్పింది పులకిత నేత్రాలతో, సుఖదాయకమైన చిరునవ్వులతో, వెచ్చటి కరస్పర్శలతో, ప్రియతమమయిన ఆలింగనాలతో వారు ఆతిథ్యమిచ్చారు. ఆ ఆతిథేయులు అతిథులకని తెరిచి వుంచింది తమ గృహకవాటాలనే కాదు, హృదయాలను

నాకు పరిచితురాలైన ఒక భారత యువతి ఒక రహస్యగాధను చెప్పింది. ఉత్సవ సమయంలో రైళ్ళన్నీ బాగా క్రిక్కిరిసి పోయ్యాయని ఒక వృద్ధుడు విమర్శిస్తే, అంత మాత్రానికే చుట్టూ వున్నవాళ్లు ఆయన్ను దుయ్యబట్టారట: "అంత మాటనడానికి ఎట్లా నోరు వచ్చింది నీకు? మన అతిథులను కించబరచ

"ఎక్కడినుంచి తమరాక? ...సుడాన్ నుంచా?"



క్రీడాకారుల రాక



డానికి నీవు యెట్లా సాహసించావు! ఎవరన్నా ఒక అతిథి విన్ను చూడడానికివస్తే. ఆ అతిథికి సుఖాసనం యిచ్చి, నీకు అత్యంత ప్రియతమమైన దానిని ఆ ర గిం పు చెయ్యవూ? హృదయ పూర్వకంగా స్వాగతం యివ్వగలిగినప్పుడు కొస్త క్రిక్కిరిసి ఆంత ఇరుకనిపిస్తే మునిగిపోయిం దేమిటి?"

ఆప్రయాణీకులకు, తమతోపాటు కూర్చున్న ఆ భారత యువతికి రష్యన్ భాష బాగా వచ్చునన్న విషయం బహుశా తెలియకపోవచ్చు. బండి దిగి పోతున్నప్పుడుకూడా ఆవిడకు, ఆ వృద్ధుణ్ణి చీవాట్లు పెడుతుండడం వినిపిస్తూనే వుందట:

"మన నగరానికి, విచ్చేసిన ప్రపంచ యువజనులందరికీ స్వాగతంచెప్పే గౌరవం లభించినందుకు, పెద్దవాడివైన నువ్వు ఎంతో సంతోషించాలి!" అన్నారొకరు.

"నన్ను వృద్ధు డనకపోతే చాలు, నీకు నా ధన్యవాదాలు!" అని ధుమధుమలాడాడు ఆ నేరస్థుడు.

నిజంగానే, ఈ రోజుల్లో వృద్ధుడంటే ఎవ్వరూ ఊరుకోరు! అతిథులకే గాని, అతిథేయులకేగాని, చిన్నవాళ్ళకేగాని, పెద్దవాళ్ళకే గాని ఇప్పుడు ఇంట్లోపట్టు నంటిపెట్టుక కూర్చోవడం దుస్సహంగా వుంటుంది.

## ఉద్విగ్న ఉత్సవ దినం

ఆ ఆదివారం, ఉ త్స వ ం బారులు తీరుతుండగా, ప్రతినిధులు వస్తున్నప్పుడు జరిగిందేమిటి? సముత్సుకులైన ప్రజ మా బస్సులన్నింటినీ గంటకు పైగా నిలిపివేశారు. ప్రతి వ్యక్తీ అతిథులను చూడడానికీ, వాళ్ళకు పువ్వులివ్వడానికీ, వాళ్ళతో కరస్పర్శ చెయ్యడానికీ, వాళ్ళతో మాట్లాడడానికీ తహతహ లాడాడు. భారత ప్రతినిధివర్గ సభ్యుడొకడు, ఇది, అతని జీవితంలో మహోద్విగ్నమైన సుదినమని నాతో చెప్పాడు. ఇంకా అతనన్నాడు, మాస్కో వాసులు యిస్తున్న ఈ ఘన స్వాగతానికి తన సహచరు లనేకుల కళ్లు చెమ్మగిల్లాయని. ఆ చెమ్మగిలిన క న్ను ల లో తొణికిసలాడింది ఆనందం, కృతజ్ఞత.

నాకు కనిపించింది, దేశదేశాలలోని నిరాడంబరులైన ప్రజలందరిలో ఆదరణ సమృద్ధంగా వుందని, అందులోనూ సోవియట్ ప్రజలది పరాయివారిని ఆదరించుటలో ప్రపంచానికి పై చెయ్యి. ఇది కేవలం ఆదరణ మాత్రమే కాదు, బలవత్తర శాంతిప్రియత దీనికో విశిష్టతను, ప్రత్యేకతను సిద్ధింప జేసింది.

శాంతికి నమ్మకమైన బాట మైత్రేనని, ఈ ఉత్సవం నిరూపించింది: ఇందులోనే వుంది ఈ యువజన మహోత్సవపు పరమార్థం. ఈ సత్యాన్ని ప్రదీప్తం చేసిన ఆ రోజులు అందుకే నాకు చిరస్మరణీయా లవుతున్నాయి.



లెనిన్ స్టేడియం దగ్గర సోవియట్ యువజనులు ప్రదర్శించిన జానపద నృత్య దృశ్యం



ఉత్సవాన్ని గురించి

## ఒక్క చూపు

* 34,000 యువజన ప్రతినిధులు, అయిదు ఖండాలకు చెందిన 131 దేశాలనుంచి మహోత్సవానికి విచ్చేశారు.
* 1000కి పైగా జాతీయ సంస్థలు ఉత్సవంలో పాల్గొన్నాయి.
* 22 అంతర్జాతీయ సంస్థలు ఉత్సవ కార్యకలాపాలను బలపరచి, ఉత్సవంలో ప్రాతినిధ్యం వహించాయి. వీటిలో యునెస్కో, అంతర్జాతీయ మహమ్మదీయ యువజన సమాఖ్య అంతర్జాతీయ క్వేకర్ క్రైస్తవ సంస్థ, వసుధైక భాషా ప్రవర్తక యువజన సంఘం మొదలైనవి వున్నాయి.
* ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికా దేశాలనుంచి వచ్చిన ప్రతినిధుల సంఖ్య, గత వార్సా మహోత్సవపు ప్రతినిధుల సంఖ్యకు రెట్టింపైంది, భారత దేశానికి ప్రాతినిధ్యంవహిస్తూ 450 మందీ, చీలికి ప్రాతినిధ్యం వహిస్తూ 160మందీ, బ్రెజిల్‌కు ప్రాతినిధ్యం వహిస్తూ 300 మందీ, ఈజిప్టుకు ప్రాతినిధ్యం వహిస్తూ 650, సిలోన్‌కు ప్రాతినిధ్యం వహిస్తూ 230 మందీ, జపాన్‌కు ప్రాతినిధ్యం వహిస్తూ 260 మందీ ఈ ఉత్సవంలో పాల్గొన్నారు. బ్లాక్ ఆఫ్రికానుంచికూడా అనేకులు ప్రతినిధులు వచ్చారు.
* ఉత్సవ క్రీడాకార్యక్రమాల్లో 46 దేశాలకు చెందిన 3,600మంది యువక్రీడాకారులు పాల్గొన్నారు
* భారతీయ ప్రతినిధివర్గ ప్రప్రథమ కార్యక్రమం సోవియట్ దేశ వ్యవసాయ ప్రదర్శనాలయ బహిరంగ ప్రదర్శనశాల, "గ్రీన్ థియేటర్"లో జూలై 29న జరిగింది. 4,000 ప్రేక్షకులకు స్థలంవున్న ఆ బహిరంగ ప్రదర్శనాలయం క్రిక్కిరిసిపోయింది. కార్యక్రమాన్ని ముగిస్తూ భారత గాయక బృందం "హిందీ-రూసీ, భాయ్-భాయ్" పాడినప్పుడు ఉత్సాహతరంగం ప్రేక్షకులను పారవశ్యంలో ముంచెత్తింది.
* ఉత్సవ సందర్భంగా ప్రతిరోజూ రమారమి 400 కార్యక్రమాలు వివిధంగా ఏర్పాటుచేయబడినవి. ఉత్సవ కార్యక్రమాలన్నీ ఒకదానితర్వాత ఒకటి జరిగినట్టయితే, వాటిని నివేదించడానికి ఒక పత్రికా విలేఖరికి, కనీసం 100 ఏళ్ళన్నా పట్టగలదని అంచనావేయబడింది!
* ఉత్సవానికి వివిధ దేశాలనుంచీ, రేడియో, వార్తాపత్రికా, టెలివిజన్ విలేఖరులు పత్రికల, వార్తాసంస్థల, సినిమా సంస్థల ప్రతినిధులూ 2000 కు పైగా హాజరయినారు.
* ఉత్సవ దినాలలో "సమాచార పత్రిక" 5 భాషలలో ప్రచురించబడింది.



# భారత యువతికి

ఎ. ఎరికెయేవ్

ఎన్నడూ చూడలేదు భారత దేశాన్ని నేను,
ఎన్నడూ చూడలేదు ఆ దేశపు పుష్పాల, పరపశ్యామల.
అంతా కొత్తే ఆ దేశపు భాష నాకు,
అయినా—ఆ దేశపు పాటల వింటున్నప్పుడు,
మాటలు లేకుండానే అంతా అర్థమైంది నాకు.

విశిష్ట భారత గీతం విశదం చేసింది నాకు:
కలధౌత శృంగమ్ముల, సముద్ర తట నగరమ్ముల,
పూ గుబ్బలు పొదిగిన పచ్చిక బయళుల,
అరవిచ్చిన బాదం పూ పరిమళముల, పవిత్ర నదీ నదమ్ముల,
గుడి గోపుర శిఖరాంచల రవి కాంతుల.

నిర్మలములు నీ అధరమ్ములు మలయ పవన తుల్యమ్ములు,
రవి కిరణ స్ఫూరకములు నెలతా! నీ దృక్కులు.

కొత్తగా జయించుకొన్న స్వాతంత్ర్యం,
కల్పిస్తుంది ఆవేశం.
దృఢంగా నిలవాలి నువ్వు, దృక్కుల సాకాశాలకు సారించి,
నవ జీవనం పురివిప్పుకొంటున్నది నీ ముందర,
సహించబోవిక గతకాలపు టన్యాయమ్ముల.

వినూత్నములు పరిస్థితులు, సంప్రదాయ పునీతములు
వింటున్నాను నేను నీ పాటల పల్లవిస్తున్న ఈ సందేశాన్ని

పవిత్ర భాగీరథిని నే నెన్నడూ చూడలేదు.
దూరాలు తీరాలు వేరుచేస్తున్నాయి మనల్ని,
అయితేనేం, అనురాగ బాంధవ్యం దగ్గరకు తెస్తున్నది మనల్ని,
మంత్రముగ్ధం చేస్తున్నాయి నీ పాటలు నన్ను,
అవి తాకుతున్నాయి సూటిగా నా గుండెల్ని.

# ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామం 1857-59 గురించి సోవియట్ చరిత్రకారులు

ప్రొఫెసర్ ఎ. ద్యకోవ్

సోవియట్ మార్క్సిస్టుచరిత్రకారులు 1857-1859 తిరుగుబాటును భారత ప్రజల చరిత్రలో ఒక అత్యంత ముఖ్యఘట్టంగా సర్వదా పరిగణిస్తూవచ్చారు.

ఈ పోరాటానికి సమకాలికులైన మార్క్సిజం స్థాపకులు మార్క్సు ఏంగెల్సులు, వాని సత్వాన్ని వ్యతిరేకించిన అమెరికన్ల వార్తా పత్రిక "న్యూయార్కు ట్రిబ్యూన్"లో యీ పోరాటం గురించి చాల వ్యాసాలు వ్రాశారు. అధిక సంఖ్యాక పశ్చిమ యూరోపియన్ గ్రంథకర్తలు యీ పోరాటాన్ని సిపాయిల పితూరీగా చిత్రించడానికి ప్రయత్నించారు: అలా కాకుండా మార్క్సు ఏంగెల్సులు తమ వ్యాసాలలో యీ పోరాటం ఒక జాతీయ పోరాటమని తెలియజేశారు. భారత దేశంలో అంతకు పూర్వం జరిగిన బ్రిటిష్ వ్యతిరేక చర్యలకంటె యీ పోరాటానికిగల విశిష్టతను చాటే అనేక ప్రత్యేక లక్షణాలను వారు పేర్కొన్నారు.

ఇది చరిత్రలో, సిపాయిలు తమ అధికారులను చావగొట్టినట్టీ, హిందూ ముస్లిములు తమ విరోధాన్ని మరచి తమపాలకులకు వ్యతిరేకంగా ఏకమైనట్టీ, సాధారణంగా జరిగేటట్లు దేశంలోని చిన్నచిన్న ప్రాంతాలకు మాత్రమే యీ పోరాటం పరిమితం కానటువంటీ తొలి సంఘటన అని మార్క్సు భారత దేశంలో యీ పోరాట స్వభావాన్ని గురించి వ్రాస్తూ నొక్కి చెప్పేరు. బెంగాల్ సైన్యం తిరుగుబాటుకు పెర్షియన్, చైనీస్ యుద్ధాలతో సన్నిహిత సంబంధం ముండడం నిస్సందేహమనీ, మొత్తంమీద భారతీయ పోరాటం, ఆసియా మహా ప్రజలు ప్రదర్శించిన అసంతృప్తితో బాటు జరిగిందనీ మార్క్సు ఏంగెల్సులు వ్రాశారు.

మార్క్సు ఏంగెల్సులు, పోరాటం సాగించిన భారతీయప్రజల పక్షాన్నే మనస్ఫూర్తిగా బలపరిచారు. సిపాయిల దారుణ చర్యలంటూ మొత్తం యూరోపియన్ పత్రికలన్నిటి "హృదయ విదారకమైన" శోకానికి జవాబుగా మార్క్సు, బ్రిటిష్ వారి దారుణ చర్యలను వర్ణిస్తూ యిలా తెలియజేశారు:

"బ్రిటిష్‌వారు అటువంటి కృత్యాలు ఉద్దేశపూర్వకంగా చేయగలిగినప్పుడు, కోపోద్రిక్తులైన హిందువులు ఆవేశంతో తిరుగబడి పోరాడుతూ, వారిపై ఆరోపించబడిన నేరాలూ, దారుణకృత్యాలుచేశారంటే ఆశ్చర్యమేముంది?"

గత శతాబ్దం మధ్యలో భారత దేశంలో జాతీయ పోరాటం గురించి సోవియట్ చరిత్రకారులు, మార్క్సు ఏంగెల్సుల మూల సూత్రాలతో పూర్తిగా ఏకీభవిస్తున్నారు.

ఈ పోరాటం యొక్క సాంఘిక మూల కారణాల గూర్చి పరిశీలించడంపై తమదృష్టిని కేంద్రీకరిస్తున్నారు సోవియట్ చరిత్రకారులు. భారత దేశ చరిత్ర గురించిన అనేక వ్యాసాలలోనూ, గ్రంథాలలోనూ యీవిషయమై వ్రాయబడింది.

భారత ప్రజల చరిత్రపట్ల సోవియట్ ప్రజలు అత్యంత శ్రద్ధాసక్తులు కనబరుస్తున్నారు. సోవి

(మిగత 28వ పుటలో)

# భిలాయ్ వార్తలు



బ్లాస్ట్ ఫర్నెస్ నెం 1, కౌపర్ బ్లాస్ట్ ఎయిర్ హీటర్ల నిర్మాణ స్థావరం. ఈ బ్లాస్ట్ ఫర్నెస్, 24 గంటలలో, వెయ్యిటన్నులకుపైగా లోతయినుమును ఉత్పత్తి చేస్తుంది



భిలాయ్ ఉక్కు పరిశ్రమాగారానికి సోవియట్ దేశం నుంచి వస్తున్న లోహపు చట్రాలన్నీ నిలువ చేయబడే స్థలం. ఇక్కడ ఒక్కొక్కటి 30 టన్నుల బరువు నెత్తగల నాలుగు సోవియట్ గాంట్రీ-క్రేన్లు అమర్చబడ్డాయి

# భారత దేశ రిపబ్లిక్ స్వాతంత్ర్య వార్షికోత్సవం

భారత రిపబ్లిక్ తన దశమ స్వాతంత్ర్య వార్షికోత్సవాన్ని జరుపుకుంటోంది. ఇది భారత ప్రజలకు మాత్రమే కాకుండా దేశాల మధ్య స్నేహసమానత్వాలను వాంఛించే, పీడననూ, వలసవిధానాన్నీ వ్యతిరేకించే ప్రపంచంలోని దేశాలన్నిటికీ కూడా యిదొక ముఖ్య సంఘటన.

భారత దేశ స్వాతంత్ర్య దశమ వార్షికోత్సవం యీ ఏడాది యింకో ప్రముఖ దినాన—బ్రిటిష్ పాలనకు వ్యతిరేకంగా 1857—1859 జాతీయ తిరుగుబాటు శతవార్షికోత్సవ సమయంలో వస్తున్నది. నూరు ఏళ్లక్రితం భారతీయ ప్రజల వీరపుత్రులు, వలస రాజ్యాధిపతులకు వ్యతిరేకంగా ఆయుధపాణులయ్యారు. తమ కు మించిన బలంగలవారితో చేసిన పోరాటంలో వారు ఓడిపోయారు, కాని వారి స్మృతి స్వాతంత్ర్య కాముకప్రజల మనస్సులో శాశ్వతంగా నిలచివుంటుంది.

భారత దేశ చరిత్రలోని యీ రెండు ముఖ్యఘటనలకు సంబంధించిన యీ రెండు వార్షికోత్సవాలు, తమ స్వాతంత్ర్యం కోసం భారతీయ ప్రజలు ఎంత ఎక్కువగా త్యాగం చేశారో ప్రతి ఒక్కరికీ జ్ఞాపకం చేస్తాయి.

సుమారు రెండు శతాబ్దాలు సాగిన వలసపీడన, భారతీయుల ధైర్యాన్ని, విముక్తికోసం పోరాటం సాగిద్దామన్న వారి దీక్షను భగ్నం చేయలేదు. పదేళ్ళక్రితం యీ వీరోచిత పోరాటం జయించింది.

బ్రిటిష్ అధిపత్యం భారత దేశానికి ఎటువంటి విషాదఫలితాలను యిచ్చిందో సోవియట్ ప్రజలకు తెలుసును. గత పదేళ్ళలో భారతీయులు ఏకరీతిని స్వార్థరహితంగా సృజనాత్మక కృషిని సాగించారనీ, ఆర్థిక కష్టాలను అధిగమించడానికి పోరాడారనీ, స్వతంత్రమైన నూతన జాతీయార్థిక విధానాన్ని నెలకొల్పుకున్నారనీ వారెరుగుదురు. స్వతంత్ర భారత దేశ విజయాలనూ, జాతీయార్థికాభివృద్ధి నిమిత్తం దాని పంచవర్ష ప్రణాళికల పరిపూర్తినీ సోవియట్ ప్రజలు మనఃపూర్వకంగా గమనిస్తున్నారు.

భారత దేశపు రేడియోలో 1955 డిసెంబరు 13న ప్రసంగిస్తూ యన్. యస్. కృశ్చెవ్ సోవియట్ ప్రజల భావాలను వ్యక్తపర్చుతూ యిలా చెప్పారు: పెద్దపారిశ్రామిక సంస్థలూ, జలవిద్యుత్కేంద్రాల నిర్మాణ స్థలాలతో బాటుగా మేము చాలా జాతీయ భారతదేశపు ఫాక్టరీలనూ, ప్లాంటులనూ చూశాము. వీటన్నిటినీ మా భారతీయ స్నేహితులు ఎంతగా గర్విస్తూ మాకు చూపించారని। ఈ పరిశ్రమలు శక్తివంతమైన భావిభారతీయ ఆర్థిక విధానానికి, దాని స్వాతంత్ర్యానికీ, దాని జాతీయ శక్తికీ మూలకందాలు కావడంవల్ల, యీగర్వాన్ని మేము అర్థం చేసుకున్నాం." తన ప్రజల వీరోచిత కృషి ఫలితంగా భారతదేశం యిప్పటికే తన జాతీయార్థికాభివృద్ధిలో పెద్దగా ముందంజ వేసింది.

పూర్వపు వలస పరాధీనతనుండి సంపూర్ణ దేశ ఆర్థిక విముక్తి సాధనకొరకు పాటుపడుతోన్న స్నేహప్రజల కృషిని ఎంతో సానుభూతితో సోవియట్ ప్రజలు గమనిస్తున్నారు. శక్తివంతమైన స్వీయ పరిశ్రమ సృష్టించుకునేందుకు భారతదేశం చేస్తోన్న కృషి వారికి సన్నిహితమైనది.

భిలాయ్‌లో పెద్ద ఇనుము, ఉక్కు మిల్లు నిర్మాణానికి ఒడంబడిక, సోవియట్ దేశానికీ భారత దేశానికీ మధ్య ఋణాల గురించి చేసుకోబడిన ఒడంబడికలు, దేశాల మధ్య స్థాపింపబడిన స్వార్థరహిత స్నేహ సంబంధాలకు మంచి దృష్టాంతాలు. సోవియట్-భారతీయ సంబంధాలు, మహాపురుషుడు లెనిన్ ప్రకటించినటువంటి—విభిన్న ఆర్థిక, రాజకీయ వ్యవస్థలుగల దేశాలమధ్య శాంతియుత సహజీవనం సాధ్యమేనన్నసూత్రం సరియైనదనడానికి గట్టి తార్కాణం.

పది సంవత్సరాల తన స్వతంత్ర జీవనంలో భారత దేశం గొప్ప అంతర్జాతీయ ప్రతిష్ఠను సంపాదించింది. ప్రపంచ శాంతి కొరకు, ముఖ్యంగా ఆసియాలో శాంతికొరకు పోరాటంలో భారత విదేశాంగ విధానం ఒక ముఖ్యమైన పాత్రను నిర్వహిస్తోంది. శాంతి కాముక శక్తులన్నీ, శాంతిని సంఘటిత పరిదేందుకు పరమాణు, ఉదజని ఆయుధాల నిషేధంకోసం భారత రిపబ్లిక్కు కృషి ఎంతో విలువైనదానిగా పరిగణిస్తున్నాయి.

శాంతి, స్నేహాలకొరకు తాముచేస్తోన్న అచంచల కృషిద్వారా, అంతర్జాతీయ సంబంధాలలో ఉద్రిక్త పరిస్థితి ఉపశమనానికి పోరాటం ద్వారా సోవియట్ దేశం, భారత దేశం యింకా సన్నిహిత మవుతున్నాయి. శాంతియుత సృజనాత్మక కృషిలో నిమగ్నులైవున్న మన ప్రజలకు యుద్ధం అక్కరలేదు. తమ తమ మార్గాలలో సాగిపోతూ వారు ఒక నూతనమైన, సుఖతరమైన జీవిత మార్గంలో పురోగమిస్తున్నారు.

మనప్రజలను ఒకరిపైక ఒకరిని రెచ్చగొట్టడానికీ, వారి సంబంధాలలో అవిశ్వాస, శత్రుత్వ భావాలను రేకెత్తించడానికీ చేసే ప్రతి ప్రయత్నమూ విఫలంకాక తప్పదు. ముఖ్యంగా యీ రెండు వార్షికోత్సవాల దినాలలో సోవియట్ ప్రజలు యన్. యస్. కృశ్చెవ్ చెప్పిన మాటలనే హృదయపూర్వకంగా చెపుతున్నారు. ఆయన 1955 నవంబరు 21న భారత రిపబ్లిక్ పార్లమెంటులో ఉపన్యసిస్తూ యిలా అన్నారు:

"మీరు శక్తివంతమైన జాతీయ పరిశ్రమను పొందాలని మేము మనఃపూర్వకంగా ఆశిస్తున్నాము, మీ దేశంలో విజ్ఞాన శాస్త్రం, సంస్కృతి, విద్య పెంపొందాలని కోరుతున్నాం, సర్వదా మీకు విజయమూ, సౌఖ్యమూ ప్రాప్తించును గాక।"

# 12 శతాబ్దపు రష్య

## (వ్లాదిమిర్ సుజ్దల్ విధానం)

(ఛాయాచిత్రాలు: వా. త్సెనరస్కీ)



ఉస్పెన్‌స్కీ క్రైస్తవ దేవాలయ దృశ్యం



మీరు మాస్కోకు యింకా రాకపోయినప్పటికీ దాని క్రెమ్లిన్ గోడలూ, శిఖరాలూ, దాని క్రైస్తవ మత దేవాలయాలూ, గోపురాలూ పోస్టుకార్డులు మొదలైన వాటినిబట్టి అవి ఎలాగ వున్నవో మీకు తెలుసును. క్రెమ్లిన్ భవన సముదాయం, మధ్యయుగాలనాటి మాస్కో స్మృతిచిహ్నాల వాస్తుశిల్పంలో ఉత్తమోత్తమమైనదని పరిగణింపబడుతూ వుండడం అర్థమైన విషయమే. ఇది ఖ్యాతిలో తాజ్ మహల్ కంటెకాని, రోమ్‌లోని సెయింట్ పీటర్స్‌కంటెకాని తక్కువేమీకాదు.

కాని, క్రెమ్లిన్ భవనాలు నిర్మింపబడినప్పటికే, రష్యన్ వాస్తుశిల్పం చాలాకాలంగా పెంపొంది ప్రఖ్యాతిని గన్నదని, పూర్వపు రష్యన్ వాస్తుశిల్ప విధానాల నుండి దాని నిర్మాతలు చాలా స్వాయత్తం చేసుకున్నారనీ అందరికీ తెలిసిన విషయంకాదు. రష్యన్ వాస్తుశిల్ప ప్రగతికి చాలా తోడ్పడిన ప్రాచీన రష్యన్ వాస్తుశిల్ప రూపాలలో ఒకదానిని—వ్లాదిమిర్-సుజ్దల్ విధానం (12, 13 శతాబ్దాలు)—ప్రతిబింబించే చాలా స్మృతిచిహ్నాల గురించి యీ వ్యాసంలో వివరిస్తాము.

పచ్చపచ్చగా పెరిగివున్న గడ్డి తివాసీలాగా కప్పివున్న ఒక బయలు మన ఎదుటనుండి చెట్ల పైభాగాలు ప్రశాంతంగావున్న వాగులో తమ ప్రతిబింబాలను వేస్తున్నాయి. అలజడి లేని, హాయిగావున్న యీ వాతావరణంలో నిలిచివుంది, ఒక కనులు మిరుమిట్లు గొలిపే చక్కని సౌధం (వెనుక అట్టచూడండి).

ఇది నెర్ల్‌నది ఒడ్డున వున్న ఇంటర్‌సెషన్ చర్చి. పొక్రోవ్ బొగొరొదిత్సి. ఇదియించు మించు 800 సంవత్సరాల క్రితం నిర్మింపబడింది. యిప్పుడీ చర్చివున్న వ్లాదిమిర్ నగరానికి 200 కిలోమీటర్ల దూరాన చిన్న గ్రామముగా మాస్కో వున్న కాలంలో.

చదరంగా వున్న యీ చిన్న కట్టడానికిపైని ఒకేఒక గోపురం వుంది. ముందుకు చొచ్చుకుని కొంతవరకూ గోడలో కలిపికట్టి వున్న విశాలమైన స్థంభాలు, ఫిరంగులు కాల్చడానికి వుండే రంధ్రాలవంటి చిన్న కిటికీలూ, కొద్దిగా సాధారణమైన ఉబ్బెత్తు బొమ్మలూ దానికి వున్నాయి. ఈ నిరాడంబరమైన, యీ నిరలంకృతమైన చర్చి ఏవిధముగా యిటువంటి మరపురాని, మైమరపించే భావాన్ని కలుగ జేస్తుందో అని ఎవరైనా ఆశ్చర్యపడకతప్పదు.



# ...ం వాస్తుశిల్పం





ద్మిత్రియెవ్‌స్కీ సొబొర్, అంత చొచ్చుకరానట్టున్న దాని సోపాన పాళిక దగ్గరనుంచి పరిశీలనగా చూస్తే విశిష్టంగా వుంటుంది

దాని ఆశ్చర్యజనకమైన అవయవానురూపత్వంలోనూ (సిమెట్రీ), దాని ప్రతి చిన్న అంశమూ నిర్మాతల ముఖ్యభావానికి—చర్చి పైపైకి, స్వర్గంవేపుకు పోతున్నదన్న భావాన్ని కలుగజేయడానికి అనుగుణంగా వుండడంలోనూ యీ చిక్కు ప్రశ్నకు శాస్త్రజ్ఞులకు జబాబు దొరుకుతుంది. కాని యింకో రహస్యాన్ని అన్వేషించడానికి రష్యాలోని మధ్య జిల్లాలకు వెళ్ళడం అవసరం. వాస్తుశిల్పులు తమ దేశ ప్రకృతిని కూలంకషంగా ఎరుగుదురు, దానిని సుగ్రాహ్యం చేసుకున్నారు. కఠినమైన ప్రకృతి యిది. ధగద్ధగాయమానమైన రంగులు యిందులో కనిపించవు. కాని అది ప్రశాంతమైనది, ఆలోచనా నిమగ్నమైనది కవితా భరితమైనది.... ఈ పచ్చని అడవుల, నిర్మలమైన పచ్చిక బయళ్ళ ప్రకృతిదృశ్యంలో వారు తమ భవనాలను నిర్మిస్తారు, యింత సాధారణంగానూ, లావణ్యంగానూ, ముగ్ధంగానూ.



ద్మిత్రియెవ్‌స్కీ సొబొర్‌లోని ఉబ్బెత్తు శిల్ప దృశ్యం

## అసంప్షన్ కెథెడ్రల్ (ఉస్పెన్‌స్కీ)

ఇదేకాలంలో, యిదే వ్లాదిమిర్ ప్రాంతంలో యింకో కెథెడ్రల్ నిర్మింపబడింది. యావత్తు





ఉస్పెన్‌స్కీ క్రైస్తవ దేవాలయంలో లభించిన కుడ్యచిత్ర ఖండిక. మూడు శతాబ్దాలతర్వాత ప్రసిద్ధ రష్యనా శిల్పి అంద్రీ రుబ్లేవ్ దీనికి మళ్ళీ రంగులు వేశాడు. దేవాలయ కుడ్యాలు-ఉబ్బెత్తు—చిత్రాలతో, అతి నిపుణంగా రాతితో చెక్కబడిన తెరలతో అలంకృతమై వున్నాయి

వ్లాదిమిర్ సమీపంలో బొగొలుబోవొ గ్రామంలోని ఒక పరిరక్షిత దుర్గదృశ్యం



నగరపు వాస్తుశిల్ప సముదాయపు కేంద్రంగా మాత్రమే, యీ కెథెడ్రల్ ఉద్దేశింపబడలేదు. రష్యన్ చర్చియొక్క ఉన్నతమైన కెథెడ్రల్‌గా అది ఉద్దేశింపబడింది. అప్పుడు వ్లాదిమిర్‌ను పరిపాలిస్తోన్న ఆంద్రీ బొగొలుబ్‌స్కీ రాజు వేరువేరుగా విడిపోయివున్న రష్యనా రాజ్యాలను ఏకంచేసి, వ్లాదిమిర్ రాజు పాలనక్రిందికి తీసుకరావడానికి ప్రయత్నిస్తున్నాడు. అందువల్ల వ్లాదిమిర్‌ను రష్యాకు మత కేంద్రంగా చేయడం ఆయనకు అవసరమైంది. కొన్ని ఏళ్ళ తరవాత, దగ్ధమయ్యాక, యీ కెథెడ్రల్ పునర్నిర్మింపబడింది, యీ కొత్త రూపంలో యిప్పుడది మనకు కనిపిస్తూవుంది. ఈకట్టడం క్లియజ్మా నది ఎత్తయిన ఒడ్డుమీద వుంది, యావత్తు నగరానికీ అభిముఖంగా. ఐదు భాగాలుగాగల యీ పెద్ద కెథెడ్రల్, పొక్రోవ్ చర్చివలె నిర్మింపబడింది, "తెల్ల రాయి" లేదా సున్నపురాతితో; బంగారు మలాము చేయబడిన ఐదు గోపురాలు దానికి వున్నాయి.

ఈ కెథెడ్రల్ వినమ్రమైన రమ్యతనూ, స్మరణీయతనూ కలిగిస్తుంది. కన్నాలు గల కిటికీలూ, గోడలతో కలిపి కట్టబడిన స్తంభాలూ, విడివిడిగావున్న ప్రాంగణాలూ—యివన్నీ దాని రమణీయమైన విస్పష్టతను తెలియజేస్తాయి. నెర్ల్ తీరానవున్న చర్చి నిర్మాతలు ఉపయోగించిన రూపాన్ని జ్ఞాపకం తెస్తాయి లోపల, కెథెడ్రల్ 12వ శతాబ్దపు సిద్ధహస్తులచే చిత్రింపబడిన కుడ్య చిత్రాలతో అలంకరింపబడివుంది.

## ద్మిత్రియెవ్‌స్కీ సొబొర్

12వ శతాబ్దపు రష్యన్ చర్చి వాస్తుశిల్పానికి ఇంకో దృష్టాంతం, నెర్ల్ తీరానగల పొక్రోవ్ చర్చిని పోలివున్న ద్మిత్రియేవ్‌స్కీ సొబొర్. దీనికికూడా వున్నది ఒక్క గోపురమే, యిదికూడా చదరంగానే నిర్మింపబడింది. దీని భాగాల సంబంధం, యిదే విధంగా ఉదాత్తతా భావాన్ని కలిగిస్తుంది. అయినా, యిది నెర్ల్ తీరపు చర్చికి నకలుకాదు.

ఈ చర్చిలో వ్లాదిమిర్ శిల్పులు, పై చర్చిల నిర్మాణంలో ఉపయోగింపబడిన రూపాన్నే అనుసరించి పూర్తిగా భిన్నమైన భావాన్ని కలుగజేయగల తమ నైపుణ్యాన్ని ప్రదర్శించారు. నెర్ల్ చర్చి నాజూకుతనానికీ, కొంతవరకూ స్త్రీ సహజమైన రామణీయకతకూ భిన్నంగా ద్మిత్రీయెవ్‌స్కీ సోబొర్ పురుషత్వాన్నీ, శాంతాన్నీ చూపుతుంది. అత్యంత సామాన్యత స్థానంలో, దీనిలో రాజుగారి దేవాలయ వైభవాతిశయం కనిపిస్తుంది. దాని ప్రశస్తమైన శిల్పవిన్యాణాన్ని రసజ్ఞులు, కెథెడ్రల్ పైభాగం పైకి విసరి వున్నట్టున్న అమూల్య దుకూలంతో సరిపోల్చుతున్నారు. రాజభవనంలో ఒకభాగం యిదికూడా గొప్పగా అలంకృతమై వుంది—ద్మిత్రియెవ్‌స్కీ సోబొర్‌కు ప్రక్కగా వున్నట్టుగా త్రవ్వకాలవల్ల తెలిసింది.

వాస్తుశిల్ప చరిత్రకారులు యిక్కడ గల ఉబ్బెత్తు బొమ్మలను జాగ్రత్తగా పరిశీలించారు. అవి జంతువులనూ, చెట్లనూ, మత, మతేతర దృశ్యాలనూ చిత్రించాయి. ఇవి చాలా మౌలికమైనవి. అదే సమయాన యివి రోమనా, ప్రాచ్య—భారతీయ, అస్సీరియనా, ఇరాని

యన్....శైలల అలంకృత శిల్పాలను పోలి వుంటాయి.

పన్నెండవ శతాబ్దపు ప్రాచీన రష్యన్ చరిత్రలు యీ చర్చిని "ఒక గొప్ప అద్భుతం"అనీ "సుందరం" అనీ వర్ణించాయి. ఎనిమిది వందల ఏళ్ళకుపైగా గడిచిపోయింది. అయినా యీ వర్ణన ఇప్పటికి కూడా నిజమేనని నిస్సంశయంగా చెప్పవచ్చును.

## వ్లాదిమిర్‌లోని ఐహికమైన వాస్తుశిల్పం

పైని చెప్పబడిన కాలపు వ్లాదిమిర్ వాస్తుశిల్పులు నిర్మించిన చాలాకొద్ది ఐహిక సంబంధమైన భవనాలు మాత్రమే, దురదృష్ట వశాత్తు మనకు మిగిలాయి. ఎన్నో యుద్ధాలూ, తిరుగుబాట్లు, తాతార్ల దండయాత్రలూ, కాలం కూడా కలిసి వాటిని నశింపజేశాయి. అయినా మిగిలినకొద్దీ, తరవాత పునర్నిర్మింపబడినవీ, త్రవ్వకాలలో బయట పడినవికూడా ఐహిక సంబంధమైన వాస్తుశిల్పం ఆ కాలంలో గొప్ప ఉచ్చస్థితిలో వుండేదని సూచిస్తాయి. వ్లాదిమిర్‌కు సమీపంలోని బొగొలుబోవా గ్రామంలోని దుర్గం, యిందుకొక ఉదాహరణ. ఈ రాజభవనమూ, రాజుగారి చర్చి దుర్గంలోనే వున్నాయి. శిఖరాలు— వీటిలో ఒకటి యిప్పటికీ వున్నాయి—భవనాన్నీ, చర్చినీ ఒకే వాస్తు శిల్ప సముదాయంగా కలిపినట్టుగా భావింప బడుతోంది.

వ్లాదిమిర్ నగరానికిగల "బంగారుద్వారం" దుర్గ వాస్తుశిల్పపు యింకొక చిహ్నం. దాని ప్రాచీనమైన, పునర్నిర్మితం కాని భాగంలో పెద్ద సున్నపురాయి వుంది. దీనిగుండా ఒక ఆర్చి చెక్కబడింది. ఈ ద్వారం నగరంలోని వైభవోపేతమైన రాజ నివాస ప్రాంతానికి తీసుక వెళ్తుంది. బంగారు మలాము చేయబడిన రాగిరేకులు తాపబడిన దాని పెద్ద ఓక్ కర్ర తలుపు లనుబట్టి దానికి యీ పేరు వచ్చింది. దీనికి ఎదురుగుండా వున్న నగరపు చివరను "వెండి ద్వారం" వుంది, "బంగారపు ద్వారా"నికి కవలగా.

ఈ కొద్దిపాటి అవశేషాలుకూడా, వ్లాదిమీర్-సుజ్దల్ వాస్తుశిల్ప విధానం సాధించిన నైపుణ్యాన్ని ఎలుగెత్తి చాటుతాయి. భవిష్యత్తులో ఎన్నో సంవత్సరాలవరకూ రష్యన్ సంస్కృతీ ప్రగతిని అరికట్టిన 1237 తాతార్ దండయాత్ర, దీని అభివృద్ధికి ఆటంకాన్ని కలిగించింది.

## కిరాతకత్వాన్నీ, కాలాన్నీ అధిగమిస్తూ

తాతార్ దండయాత్ర కొట్టినదెబ్బ ఎంతో దారుణమైన దైనప్పటికీ, రష్యన్ సంస్కృతి, కళలు, వాస్తుశిల్పంతో బాటుగా వినాశనానికి అతీతమైనది. ఉత్తరపు ప్రాంతాలలో—తాతార్లు యిక్కడికి పోవడానికి సాహసించలేక పోయారు—నొవొగొరోద్‌లోనూ, ప్స్కోవ్‌లోనూ స్థానిక వాస్తు శిల్పులు పురోగమించసాగారు. క్రమక్రమంగా మాస్కో రష్యాకు కేంద్రమైంది. దాని వాస్తు శిల్పులు గతకాలపు సంస్కృతీ వారసత్వాన్ని సంస్కరించి, దానిలో నవ్యతనూ, మౌలికతనూ, ఆకర్షణనూ ప్రవేశపెట్టారు. మధ్య యుగాలనాటి వాస్తు శిల్పంలో మాస్కో శైలి—మానవ ప్రతిభ సాధించిన గొప్ప విజయాలలో ఒకటిగా నేటి వరకూ పరిగణింప బడుతోంది.



ఉస్పెన్‌స్కీ క్రైస్తవ దేవాలయ పార్శ్వ దృశ్యం





# విశ్వంలో పరిశోధనశాల



## శాస్త్రజ్ఞులు కృత్రిమ ఉపగ్రహంవల్ల తెలుసుకొనేదేమిటి?

మన భూగోళంమీది జీవితంపై ప్రభావంగల ప్రకృతి రహస్యాలను కనుగొనడానికై శాస్త్రజ్ఞులు 1957 జూలై 1వ తేదీన ప్రారంభమైన అంతర్జాతీయ భూపదార్ధ విజ్ఞాన సంవత్సరంలో అపూర్వమైన పరిశోధనా కృషి తలపెట్టేరు.

అంతర్జాతీయ భూపదార్థ విజ్ఞాన సంవత్సరపు 18 మాసాలలోనూ ప్రపంచ మంతటా ఒక అంగీకృత కార్యక్రమాన్ననుసరించి పనిచేసే వేలాది శాస్త్రజ్ఞులు వివిధ భూ పదార్ధ విజ్ఞాన క్రియలను పరిశోధిస్తారు. ఈ కృషిలో కృత్రిమ ఉపగ్రహాలకు గొప్ప ప్రాధాన్యం యివ్వబడింది.

వాతావరణపు పై పొరలనూ, ఆ పైన జరిగే ప్రక్రియలనూ పరిశీలించేందుకు ఉద్దేశించబడిన కృత్రిమ ఉపగ్రహాల నిర్మాణం అనంత విశ్వంలో ప్రవేశించేందుకు తొలి సోపానం. మానవుడు ఇతర గ్రహాలకు వెళ్ళకుండా ఆటంక పెడుతున్న ప్రధాన శత్రువైన భూమ్యాకర్షణ శక్తిపై విజయం.

మానవునిచే నిర్మింపబడి, వదిలిపెట్టబడే ఒక నూతన 'చంద్ర గ్రహం" మన భూగోళానికి దగ్గరగా తిరగడంవల్ల శాస్త్ర విజ్ఞానం యొక్క శక్తి, ప్రకృతిపై మానవుని పెత్తనమూ బాగా యెక్కువవుతుంది. తొలి ఆకాశ నౌకలు చోదకులు లేకుండానే ఎగురుతాయి. అయినప్పటికీ, యీ ఉపగ్రహాలలో వుండే పరికరాల మూలంగా శాస్త్రజ్ఞులు గాలి ఉపరిభాగం గురించి తెలుసుకో గలుగుతారు; థెర్మో న్యూక్లియర్ ప్రక్రియలను జరిపించే సహజ రియాక్టరు అయినటువంటి సూర్య గ్రహంలో జరిగే పరిణామాల గురించి విలువైన వివరాలను కూడా సంపాదించగలరు.

శాస్త్రజ్ఞులు వాతావరణపు హద్దులు దాటి పరిశీలించినట్లయితే ఎక్స్‌రె వర్ణ మిశ్రమ అల్ట్రా వైలెట్ కిరణ ప్రసరణలగురించి తెలుసుకోగలుగుతారు.

సూర్యకిరణ ప్రసరణలోని కొద్దికాలం మాత్రమే నిలచివుండే రేడియో ధార్మిక మూలపదార్థాల ప్రత్యేకలక్షణమైన స్పెక్ట్రల్ రేఖలు, సూర్యుడే వాటి జన్మస్థలమని తెలియజేయవచ్చును. అంటే, సహజ పరిస్థితులలో రసాయనిక మూలపదార్థాల పుట్టుక పరిణామాల గూర్చి అది తెలియజేయవచ్చు. ఈ పరిశీలనల ఫలితాలు, అణు ప్రక్రియల రహస్యాన్ని తెలుసుకోడానికి తోడ్పడుతాయి; థెర్మో న్యూక్లియర్ రియాక్షన్‌ను ఎలా అదుపులో పెట్టడమనే ఆధునిక పదార్థ విజ్ఞాన శాస్త్రపు ప్రధాన సమస్యను పరిష్కరించడానికి మనకు తోడ్పడవచ్చును.

### 400 కిలోమీటర్ల పైని

భూమికి 100 నుండి 400 కిలోమీటర్లు పైని వాతావరణంలోని విద్యుద్వాహకమైన పొరలలో జరిగే పరిణామాలుకూడా కుతూహల జనకమైనవి. ఇక్కడ షార్ట్-వేవ్ సూర్యకిరణ ప్రసరణం, కాస్మిక్ కిరణ ప్రవాహాలూ, ఉల్కాలేశాలూ వాతావరణాన్ని ఢీకొని, దాని పరమాణువులను నాశనంచేసి, దట్టింపబడిన లేశాల ప్రవాహాలను వదిలిపెడతాయి. వాతావరణం పై పొరలలోని క్లిష్ట పరిణామాల వెంబడిని కుతూహల జనకమైన అనేక విశేషాలు జరుగుతాయి. అరోరా బోరియాలిస్, అయస్కాంత తుఫానులు వంటివి. ఇయోనోస్ఫియర్ యెలా ఏర్పడుతుందన్న దానికి సంబంధించిన విజ్ఞానం (దీర్ఘమైన దూరాల



## అనతోలీ కార్పెంకో

సోవియట్ దేశ విజ్ఞాన శాస్త్ర పరిషత్తు
అంతర్గ్రహ కమ్యూనికేషన్ కమిషన్ కార్యదర్శి

రేడియో కమ్యూనికేషన్ విషయంలో యిది ముఖ్య పాత్రను వహిస్తుంది), దాని ద్రవ్యాలూ, యీ రెండవది సూర్యుని పైని ఆధార పడడమూ, అధునాతన రేడియో ఫిజిక్స్‌లోని అత్యంత కుతూహల జనకమైన సమస్యలలో ఒకదానిని—వేలాది కిలోమీటర్లకు పైలి కాస్ల సమస్యను—పరిష్కరించడానికి బహుశా మార్గాన్ని సూచించ వచ్చును.

మన గ్రహంపైని వివిధ కేంద్రాలనుండి కృత్రిమ ఉపగ్రహాల మార్గాన్ని పరిశీలించడంవల్ల, మనగ్రహం ఆకారాన్నీ, ప్రమాణాన్నీ నిర్ణయించడానికి భూమికొలతల గణిత శాస్త్రజ్ఞులకు అవకాశం కలుగుతుంది. కాలంతో బాటుగా గ్రహమార్గం ఎలా మారుతుందో పరిశీలించడం ద్వారా, భూ భౌతిక శాస్త్రజ్ఞులు, అతిసూక్ష్మత గల పరికరాలచే కనిపెట్టగల సాంద్రతకంటె వందల రెట్లు తక్కువగల ఎత్తులలో వాతావరణ సాంద్రతను నిర్ణయిస్తారు.

వింతగా కనిపించవచ్చునుగాని, కృత్రిమ ఉపగ్రహం, మన గ్రహంలోపల చాలా లోతుగా వున్న థెర్మల్ పరిస్థితుల గురించి మనకు ఎక్కువగా చెప్పగలుగుతుంది. భూమిపైని వివిధ భాగాలపైని ఎగురుతూ వున్నప్పుడు ఉపగ్రహం యొక్క ఉష్ణోగ్రతను కొలవడం ద్వారా, భూమియొక్క ప్రతిబింబక శక్తులకూ, ప్రసరణ శక్తులకూ సంబంధించిన వివరాలను సేకరించగలుగుతాము; తత్ఫలితంగా భూమి యొక్క థెర్మల్ బాలెన్స్‌ను యింకా సరిగా అంచనా వేయ గలుగుతాము.

### ఒక సెకెండుకు ఎనిమిది కిలోమీటర్లు

ఒక రేడియో ట్రాన్స్‌మిటర్, కొలత పరికరాలు అమర్చినట్టయితే ఉపగ్రహం, వాతావరణంలోని వివిధ క్రమాల పుట్టుక, అభివృద్ధి, అంతరించడం గురించి తెలియజేస్తుంది. ఒక సెకెండుకు సుమారు ఎనిమిది కిలోమీటర్ల వేగంతో దాని గ్రహమార్గంలో ఎగురుతూ, పైనున్న వాతావరణం పొరల గురించి ఒక అభిప్రాయాన్ని ఏర్పర్చుకోవడానికి యిది శాస్త్రజ్ఞులకు అవకాశాన్ని కలిగిస్తుంది. ఉపగ్రహమార్గం గుండ్రంగా కాకుండా, అండాకారంగా వున్నట్టయితే, అప్పుడు ఉపగ్రహం మూడు వందలనుండి ఆరు వందల కిలోమీటర్ల ఎత్తునుండి మనకు సమాచారాన్నిస్తుంది.

క్లిష్టమైన భూభౌతిక విశేషాల గురించి ఉపగ్రహాలు యివ్వగల సమాచారం, గ్రహమార్గం ఎంపికపైని ఆధారపడివుంటుంది, ఎక్కువగా. భూమధ్యరేఖకు చిన్న కోణంలో వ్రాలివున్న గ్రహమార్గాన్ని ఎంచుకున్న అమెరికన్ శాస్త్రజ్ఞుల పద్ధతికి భిన్నంగా, సోవియట్ ప్రవీణులు ధృవప్రాంతాలకు మీదుగా ఉపగ్రహానికి మార్గాన్ని ఎంచారు. యిది సాధించడానికి సాంకేతికంగా ఎక్కువ కష్టంతో కూడుకున్నది; కాని ఎక్కువ కుతూహల జనకమైనది. భూభ్రమణంవల్ల యీ ఉపగ్రహం, దాని జీవితకాలంలో భూమిపైని వివిధ భాగాలమీద ఎగిరి, భూమధ్య రేఖపైని, దానికి ద[illegible]ంగా [illegible] పై వాతావరణాన్ని పరిశీలించడానికి అవకాశాన్నిస్తుంది.

ఉపగ్రహాన్ని వదిలిపెట్టడానికి అధిగమించవలసిన ముఖ్యమైన అవరోధం, చాలా కొద్ది బరువుకలిగి, ఎంతో శక్తివంతమైన రాకెట్ యింజన్లను సృష్టించడంలో వుంది. రాకెట్టును 300-400 కిలోమీటర్ల ఎత్తుకు మూడు నాలుగు నిమిషాలలో పంపేందుకూ, గంటకు యించుమించుగా 28,000 కిలోమీటర్ల వేగాన్ని దానికి కల్పించేందుకు, యింజన్ బరువుతో ప్రతిటన్నుకూ యింజన్ల నిర్దిష్ట శక్తికి (స్పెసిఫిక్ పవర్) యించుమించు పది లక్షల అశ్వశక్తి వుండాలి.

ప్రస్తుతం పారిశ్రామికంగానూ, వైజ్ఞానికంగానూ ఎక్కువగా అభివృద్ధి చెందిన దేశాలు మాత్రమే కృత్రిమ ఉపగ్రహాలను నిర్మించ గలుగుతున్నాయి; యిందువల్ల రెండు దేశాలు మాత్రమే,—సోవియట్ దేశం, అమెరికా—యీ సమస్యను పరిష్కరించడానికి పూనుకున్నాయి.

# ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామం గురించి సోవియట్ చరిత్రకారులు

[18వ పేజీ తరువాయి]

యట్ దేశపు ప్రాచ్య విద్యాధ్యయన సంస్థలూ, విద్యాలయాలు, ఉన్నత పాఠశాలల చరిత్ర విభాగాలూ, ప్రపంచ చరిత్రలో ఒక ముఖ్య సంఘటన అయిన 1857-1859 జాతీయ పోరాటపు శతవార్షికోత్సవ సందర్భంగా సభలు జరుపుతున్నాయి.

సోవియట్ దేశ శాస్త్రవిజ్ఞాన పరిషత్తుకు చెందిన ప్రాచ్యవిద్యాసంస్థ యీ పోరాట శతాబ్దోత్సవం గురించి ఒక వ్యాస సంపుటిని తయారుచేసింది. అది త్వరలో వెలువడనుంది.

ఈ పుస్తకంలో సోవియట్ పండితుల వ్యాసాలతోబాటు ప్రొఫెసర్ మజుందార్, ప్రొఫెసర్ సెన్, ప్రొఫెసర్ అష్రఫ్‌లవంటి ప్రముఖ భారతీయ చరిత్రకారుల (వీరు సోవియట్ దేశంలో సుపరిచితులు) వ్యాసాలుకూడా వుంటాయి. ఈ గ్రంథానికి వారు రచనలు పంపడం సోవియట్-భారత చరిత్రకారుల సృజనాత్మక సహకారానికి చక్కటి నిదర్శనం.

ఈ పోరాటం యొక్క మూల కారణాల గురించి మార్క్స్ ఏంగెల్సుల అభిప్రాయాలపై ప్రొఫెసర్ ఐ. రీస్నర్ వ్రాసిన వ్యాసమొకటి యీ గ్రంథంలో వుంది.

ఈ పోరాటం జరిగినప్పుడు అభ్యుదయ రష్యా ప్రజానీకం దానిని, భారత ప్రజలు తమ్ములను బానిసలుగా చేసినవారిపై సాగించిన న్యాయమైన పోరాటంగా అంచనావేశారు. ప్రఖ్యాత రష్యా సాహిత్య విమర్శకుడూ, ప్రజాస్వామిక వాదీ అయిన డోబ్రోల్యుబోవ్ ఆ సమయంలో యీ విషయమై ఒక ప్రత్యేక వ్యాసం వ్రాశారు. మార్క్స్ ఏంగెల్సులవలెనే డోబ్రొల్యుబోవ్ కూడా యీ పోరాటం పట్ల పూర్తిగా సానుభూతి చూపేరు. ఈ పోరాటంపై రష్యా పత్రికలలో వెలువడిన వ్యాఖ్యల గురించి ఎల్. ఐ. యురివిచ్ యీ పుస్తకంలో ఒక వ్యాసం వ్రాశారు.

సోవియట్ చరిత్రకారులు 1857-1859 పోరాటాన్ని, కేవలం సిపాయిల పితూరీగానూ, ఈస్టిండియా కంపెనీ ప్రభుత్వపు ఆక్రమణ విధానంవల్ల అసంతృప్తి చెందిన ఫ్యూడల్ ప్రభువుల ఉద్యమంగానూ పరిగణించ కంలేము.

అయితే, సిపాయి దళాలే తిరుగుబాటుదారుల ప్రధాన సాయుధబలంగా వుండేవన్న లోక విదితమైన విషయాన్ని కాదనే ఉద్దేశం సోవియట్ చరిత్రకారులకు లేదు. ఈస్టిండియా కంపెనీ విధానంవల్ల ఆగ్రహం కలిగి అనేకమంది ఉత్తర భారతదేశపు ఫ్యూడల్ ప్రభువులు యీ పోరాటంలో, ముఖ్యంగా దాని ప్రారంభదశలో, ప్రముఖపాత్ర వహించారన్న విషయాన్నికూడా వారు కాదనడం లేదు. అయితే, బీహార్‌లోనూ, ఔధ్‌లోనూ, గంగా యమునా నదుల మధ్యగల ప్రాంతంలోనూ రిక్రూటు చేయబడిన సిపాయిలకు, ఆయా ప్రాంతాలలోని రైతాంగంతో (సిపాయిలు రైతులనుండే రిక్రూట్ చేయబడ్డారు) సంబంధములేకుండా విడిగా లేరని సోవియట్ చరిత్రకారుల అభిప్రాయం. తిరుగుబాటులో కొందరు ఫ్యూడల్ ప్రభువులు ప్రముఖపాత్ర నిర్వహించినప్పటికీ, చివరివరకూ బ్రిటిష్‌వారితో పోరాడిన కొద్దిమంది (ఝాన్సీ రాణీ, తాంతియాతోపీలు) మినహా, వారు ఊగిసలాడేరు, వారిలో కొందరు తరవాత తిరుగుబాటుదారులకు ద్రోహం చేశారు. సిపాయిలు యీ ఫ్యూడల్ ప్రభువులను అనుసరించలేదు. ఈ గ్రంథంలో గల ఒక ఆసక్తి జనకమైన వ్యాసంలో సోవియట్ చరిత్రకారుడు ఎ. ఎమ్. ఓసిపోవ్ తిరుగుబడిన సిపాయిలు రైతాంగంలోని ఏ తరగతులనుండి వచ్చారన్న విషయాన్ని అధికారయుత ఇంగ్లీషు మూలాధారాల ప్రాతిపదికగా పరిశీలించడానికి ప్రయత్నించారు. బ్రిటిష్‌వారు భారతీయుల ఆచార వ్యవహారాలను, ముఖ్యంగా వారిమతాన్ని, అలక్ష్యం చేశారన్న విషయమూ, విదేశ పీడకులపై కోపాగ్నిని రెచ్చగొట్టారన్న విషయమూ సోవియట్ చరిత్రకారులు గుర్తిస్తున్నారు కాని, ఈ కారణం, భారతదేశంలో దట్టంగా జనాభా గల కొన్ని ప్రాంతాలలో వ్యాపించిన యీ పోరాటానికి నిర్ణయాత్మకమైనది కాజాలదు.

ఈ పోరాటానికి పూర్వపు దశలో అప్పటి వాయువ్య రాష్ట్రంలో రైతులు సాముదాయక సమాజాలుగానే జీవించేవారు. రాజ్‌పుత్, జాట్, మియో జాతులూ, బ్రాహ్మణులూ యీ సమాజాలలో పూర్తి సభ్యులుగా వుండేవారు. ఈస్టిండియా కంపెనీ యొక్క బెంగాల్ సైన్యానికి యీ తరగతులనుండే యెక్కువమంది రిక్రూట్ చేయబడ్డారు.

బ్రిటిష్‌వారి భూమి విధానమూ, వారి పన్నుల విధానమూ గ్రామీణసమాజానికి తీవ్రమైన హాని కలిగించాయి. ఈ సమాజంలో, వంశ పారంపర్యంగా భూస్వాములైన పై తరగతులవారు నాశనమయారు. భూమిపై అనువంశికంగా వస్తున్న తమ హక్కులను పోగొట్టుకున్నారు. వారి భూమి క్రమక్రమంగా వడ్డీ వ్యాపారస్తుల హస్తగతం కావడం మొదలైంది. ఇది పైన తెల్పిన రైతాంగపు తరగతులలో అసంతృప్తి జనింప జేసింది. ఇది కూడా సైనికుల భావాలలో ప్రతిబింబితమైంది. రైతులలోని యీ వర్గాలనుండే, ఈస్టిండియా కంపెనీవారు సైన్యానికి రిక్రూట్ చేసి, ఆయుధాలిచ్చారు. ఇదే తిరుగుబాటుకు ప్రాతిపదిక శక్తి. వాయువ్య సరిహద్దు రాష్ట్రంలోనూ, ప్రస్తుత బీహార్‌లోని కొంత భాగంలోనూగల గ్రామీణ, పట్టణ ప్రజానీకం తిరుగుబాటుదారులపట్ల సానుభూతిచూపి, బ్రిటిష్‌వారితో వారు సాగించే పోరాటంలో వారికి గట్టిమద్దత్తు ఇచ్చారన్నది పై విషయాన్ని ధృవపరుస్తూంది. లక్నో, కాన్పూర్ తదితర చోట్ల జరిగిన ఘటనలు దీనికి నిదర్శనం.

ఓసిపోవ్ తన అభిప్రాయానికి ఆధారంగా యీ దిగువ విషయాన్ని ఉదహరించారు: గ్రామీణ ప్రజలలోని క్రింది తరగతులనుండి, ముఖ్యంగా "అంటరాని" వారినుండి (బ్రిటిష్ భూమి విధానంవల్ల వారి స్థితి ఏమీ మారలేదు) రిక్రూట్ చేయబడిన మద్రాసు మిలిటరీ దళాలు తిరుగుబాటులో పాల్గొనలేదు. పోరాటం గంగా నదీ పరిసర ప్రాంతాలకే పరిమితమైందనీ, దేశంలోని దక్షిణ ప్రాంతాలకు ఏమంతగా సోకలేదనీ యీ విషయం స్పష్టం చేస్తూంది. ఈ పోరాటంయొక్క మూల కారణాల గురించి ఇ. కోమరోవ్, యీ గ్రంథంలో చర్చించారు.

జాతీయ స్వాతంత్ర్యాన్ని సాధించుకున్న భారతదేశం యిప్పుడు తన చారిత్రిక పత్ర భాండాగారం పరిశోధకులకు అందుబాటులో వుంచింది. కాబట్టి *1857-1859* జాతీయ పోరాటంగురించి మరింత సమగ్రంగా సర్వతోముఖంగా పరిశోధన జరపడానికి అవకాశం ఏర్పడింది. సోవియట్ చరిత్రకారులు యీ మహాదాశయానికి సేవ చెయ్యడానికి సిద్ధంగా వున్నారు.

**అంతర్జాతీయ సమీక్ష**

# స్వాతంత్ర్యంకోసం పోరాడుతోన్న ఓమన్ ప్రజ

## ఐ. ప్లైషెవ్స్కి

ప్రపంచ ప్రజల దృష్టి, మళ్ళీ మధ్య ప్రాచ్యంలోని ఘటనలపైని కేంద్రీకృతమైవుంది.

ఆగ్నేయ అరేబియాలో ఓమన్ అరబ్ కొండజాతులు బ్రిటిష్ వలస ప్రభువులపైని తిరగబడ్డాయి. బ్రిటిష్ ప్రభుత్వం వారిని అణచి పెట్టడానికి యుద్ధవిమానాలను పంపింది. జూలై 24 నుండీ బ్రిటిష్ విమానాలు, లొంగిపొమ్మని హెచ్చరిస్తూ చేసిన తుది ఆజ్ఞకు లొంగని తిరుగబడిన కొండజాతులవారి నగరాలపైని, గ్రామాలపైని బాంబులు కురిపిస్తున్నాయి.

ఒకజాతి వారిపైని వేరొకజాతివారు చేసే పీడనకు సోవియట్ ప్రజలు సర్వదా వ్యతిరేకులు, యిప్పుడూ వ్యతిరేకులే. సామ్రాజ్య పీడనకు వ్యతిరేకంగా ఓమన్ అరబ్బులు సాగించే పోరాటాన్ని, యిందువల్లనే సోవియట్ ప్రజలు తదేకదీక్షతో గమనిస్తున్నారు. బ్రిటిష్ విమానదళాలు ఓమన్ నివాస ప్రదేశాలపైని చేసే క్రూరమైన విమాన దాడులను, శాంతికాముక ప్రజలందరివలెనే వారుకూడా అసహ్యించుకుంటున్నారు. స్వేచ్ఛకోసమూ, జాతీయ స్వాతంత్ర్యం కోసమూ పోరాడుతోన్న అరబ్ కొండ జాతుల ప్రజలపట్ల వారు పూర్తిగా సానుభూతిని చూపుతున్నారు.

*ఓమన్‌లోని స్వాతంత్ర్యోద్యమాన్ని అరబ్ ప్రాచ్య ఖండంలోని దేశాలు మాత్రమే కాకుండా, ప్రజా చైనా రిపబ్లిక్కు, భారత దేశ ప్రజలు, ఇండొనేషియా, ఇంకా చాలా దేశాలతోబాటుగా ఆసియా, ఆఫ్రికా దేశాలలోని అధికభాగం దేశాలు కూడా గట్టిగా బలపర్చుతున్నాయి.*

ఓమన్‌లో సాయుధ దౌర్జన్యం జరుపుతూ వున్నందుకు బ్రిటన్‌ను నిరసిస్తూ టైమ్స్ ఆఫ్ ఇండియా పత్రిక, ఇలా వ్రాసింది: పశ్చిమ ఆసియాలో తనకు ప్రత్యేకవిధులున్న కాలం గడిచిపోయి చాలా రోజులైపోయిందనీ, 1958లో ఉచితంగా వున్న చర్యలు 1957లో చాలా అనుచితంగా వున్నవనీ బ్రిటన్ అవగాహన చేసుకోవడం చాలా ముఖ్యం.

ఓమన్‌లో బ్రిటిష్ దౌర్జన్యం సందర్భంగా చైనా వార్తా పత్రిక *జెన్మింజిహ్‌పావో* యిలా వ్రాసింది: "*బ్రిటిష్ వలసరాజ్యాధిపతులు యిటీవలి ఈజిప్టు దురాక్రమణ యుద్ధంనుండి గుణపాఠాలను నేర్చుకొనక, ఓమన్ ప్రజల వ్యవహారాలలో ప్రత్యక్ష సాయుధ జోక్యాన్ని నేడు ప్రారంభించారు....బ్రిటిష్ ప్రభుత్వం చేస్తోన్న యీ క్రూరచర్యలు, శాంతి న్యాయాలకోసం పోరాడే యావత్ప్రపంచ ప్రజలలో కోపోద్రిక్తతను కలిగించక తప్పవు.*"

అరేబియన్ ద్వీపకల్పంలో ఆధిపత్యంకోసం బ్రిటిష్, అమెరికన్ గుత్త నూనె వ్యాపారసంస్థల మధ్యగల తీవ్ర వైరానికి సంబంధించిన క్లిష్ట పరిస్థితిలో, నేడు ఓమన్ అరబ్బులు తమ స్వాతంత్ర్యం కోసం పోరాడుతున్నారు. సమీప, మధ్య ప్రాచ్యాలలోని విముక్త సమర విజయాలు, అక్కడ బ్రిటిష్ సామ్రాజ్యవాదాన్ని ఎంతో బలహీన పరిచాయి. ఈజిప్టులో పరాజయానంతరం బ్రిటన్ మధ్యప్రాచ్యంలో "బిరుసు తనా"న్ని చూసి, ఓమన్లోని జాతీయోద్యమాన్ని రక్తపాతంలో ముంచెత్తక పోయినట్టయితే, యీ ప్రాంతంలో అది అల్లకల్లోలంలో పడిపోవలసి వస్తుందని బ్రిటిష్ గుత్త వ్యాపార వర్గాలు భావిస్తున్నాయి.

అరేబియన్ ద్వీపకల్పనుండి బ్రిటిష్ పోటీదారులను తరిమివేయడానికి, యీ పరిస్థితిని ఉపయోగించుకునేందుకు అమెరికన్ గుత్త నూనె వ్యాపార సంస్థలకు అభ్యంతరమేమీ లేదు. స్క్రిప్స్-హావర్డ్ వార్తా పత్రిక వ్యాఖ్యాత షాక్‌ఫోర్డ్, *న్యూయార్క్ వర్ల్డ్ టెలిగ్రామ్ అండ్ సన్‌*లో, ఉదాహరణకు ఓమన్లోని సంఘర్షణకు అమెరికన్, బ్రిటిష్ నూనె కంపెనీల తీవ్రమైన పాత స్పర్ధలతోనూ, రాజకీయ కుట్రలతోనూ సంబంధం గలదని తెలియజేశారు.

నిజమే, అమెరికన్ పాలకవర్గాలు ఓమన్ ఘటనలలో ఆంగ్లో-అమెరికన్ స్పర్ధలను తక్కువచేసి చెప్పడానికి ప్రయత్నిస్తున్నాయి. కాని *న్యూయార్క్ హెరాల్డ్ ట్రిబ్యూన్‌*తో అంగీకరించక తప్పదు. వాషింగ్టన్‌లో దౌత్య సంబంధమైన ఉపేక్షాభావం వెనుక గొప్ప నూనె సంపదలుగల ముస్కట్, ఓమన్ రాజ్యంలో జరుగుతున్న అలజడుల విషయమై తీవ్రమైన ఆందోళన దాగివుందన్నట్లుగా ఆ పత్రిక వ్రాసింది.

జూలై 29న డల్లెస్ లండన్‌కు తొందరబాటుగా వెళ్ళడం

(ప్రాధికార ప్రకటన ప్రకారం ఐక్యరాజ్యసమితి నిరాయుధీకరణ ఉప సంఘం పని నిమిత్తం) అరేబియన్ ద్వీపకల్పంలో కొండజాతుల ప్రజల తిరుగుబాటు సందర్భంగా జరిగిందని కూడా చాలామంది అంటున్నారు. కేవలం బ్రిటిష్ ఫ్రెంచి వ్యాఖ్యాతలు భావిస్తున్నదిది. టైమ్స్ దౌత్య వ్యవహారాల వ్యాఖ్యాత జులై 29న, అరబ్బు ప్రపంచంలో అవలంబించ తగు విధానం గురించి చాలా ముఖ్య నిర్ణయాలను చేయడానికి సంఘటనలు ప్రాతిపదికను తయారుచేసిన కాలంలో డల్లెస్ లండన్‌కు వస్తున్నారని వ్రాసేరు తన భావాన్ని విశదీకరిస్తూ యీ వ్యాఖ్యాత, నిరాయుధీకరణ విషయం కాకుండా సౌదీ అరేబియాతోనూ, పెర్షియన్ జలసంధిలోని యీ చిన్న రాజ్యంతోనూ అమెరికా బ్రిటన్ల సంబంధాల సమస్యను అత్యున్నత స్థాయిలో చర్చించడం కూడా అవసరమని ఓమన్ తిరుగుబాటు తెలియజేస్తుందని అన్నారు.

బ్రిటిష్ అమెరికన్ గుత్త నూనె వ్యాపార సంస్థలు, మధ్య ప్రాచ్యంలోని నూనె సంపదలుగల ప్రాంతాలలో నివసించే ప్రజలకు నష్టకరంగా, ముఖ్యంగా ఓమన్ అరబ్ కొండజాతుల ప్రజలకు నష్టకరంగా తమ విభేదాలను తాత్కాలికంగా సర్దుబాటు చేసుకునేందుకు ప్రయత్నిస్తాయని భావింపబడవచ్చును. బ్రిటిష్ పత్రిక అబ్జర్వర్ దీనిని కోరింది. దౌత్య మార్గాలద్వారా ఓమన్ హోదాను మాత్రమే కాకుండా, సౌదీ అరేబియాకూ, పెర్షియన్ జలసంధి తీరం వెంబడినీ, భారత సముద్రతీరం వెంబడినీ గల రాజ్యాలకూ మధ్యగల వివాదగ్రస్తమైన సరిహద్దుభూములన్నిటి హోదాను కూడా పరిష్కరించేందుకు అమెరికాతో బాటుగా యింకా తీవ్రప్రయత్నాలు సాగించాలని, యీ పత్రిక బ్రిటిష్ ప్రభుత్వాన్ని కోరుతోంది.

కాని, సామ్రాజ్యవాదు లెటువంటి కుట్రలు పేసినప్పటికీ, వలస, పరాధీన దేశాల ప్రజలు స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కొరకు సాగించే విజయ యాత్ర ఆగిపోదని, గతించిన సంవత్సరాల చరిత్ర తెలియజేస్తోంది. ప్రపంచంలోని యీ భాగంలో అరబ్ ప్రజలు, ప్రాచ్య ఖండంలోని యితరదేశాలు సాధించుకున్నట్టుగా స్వాతంత్ర్యాన్ని సాధించుకుంటారనడానికి ఎటువంటి సందేహమూ లేదు. స్వాతంత్ర్యోద్యమం అజేయమైనది.



# సోవియట్ దేశ వ్యవసాయ ప్రదర్శన

(13వ పుట తరువాయి)

దుస్తులు వేసుకునివున్న బండివానిని జనం హర్షధ్వానాలతో అభినందించారు. దేశంలో, ముఖ్యంగా సోవియట్ పరిపాలనా కాలంలో కొత్త జాతుల గుర్రాలు చాలా పెంపొందింపబడ్డాయి. కాని ఓర్లోవ్ మేలు జాతి గుర్రాలు యిప్పటికీ ప్రపంచంలోని ఉత్తమాశ్వాలుగా పరిగణింప బడుతున్నాయి. సోవియట్ క్షేత్రాలు యీ జాతిని అభివృద్ధి చేస్తున్నాయి.

ప్రదర్శనకు వెళ్లే వ్యవసాయ యంత్రాలను వడిపేవారికి, "మెషీన్ ట్రాక్టర్ స్టేషన్" అన్న ప్రదర్శనశాల మంచి ఆకర్షణ కేంద్రం. ప్రదర్శన శాలలోని అరుబయలు స్థలాలలో వ్యవసాయ యంత్రాలు ప్రదర్శింపబడి వున్నాయి. గైడ్‌గా పనిచేస్తోన్న ఒక వ్యవసాయ శాస్త్రజ్ఞుడు, వారికి కొత్త పంటకోత యంత్రాలను పరిచయం చేస్తున్నాడు. ఉదాహరణకు, యిక్కడ చాలా సదుపాయమైన హైడ్రాలిక్ కంట్రోల్సుతో ఒక కొత్త పశుగ్రాసం కోత యంత్రమూ, ఒక జొన్న కోత యంత్రమూ, ట్రాక్టర్‌మీద నున్న నూర్పు, కోత యంత్రమూ వున్నాయి. ఇవి వాటిని స్వతంత్రంగా ట్రాక్టరు డ్రైవరు నడపడానికి అవకాశం కలిగిస్తాయి. ఎక్కువ నిపుణంగానూ, లాభదాయకంగానూ వుంటూ పనిని తేలికచేసే యంత్రాలు కూడా వున్నాయి.

ఆదాయాలకు సంబంధించినంతవరకూ "సైబీరియా" అన్న ప్రదర్శనశాలలో మేమొక అసాధారణమైన వస్తువును చూశాము. అది సమిష్టి కర్షక వ్యవసాయం ఎంత లాభదాయకమో నిరూపించింది. ఇది ధాన్యం బస్తాల, గడ్డిబేళ్ళ, తదితర వ్యవసాయ వస్తువుల గుట్టలు, క్రాస్నీ క్లొబొరోబ్ సమిష్టిక్షేత్రంలోని బురవ్‌ఛెంకో కుటుంబం దీనిని గత ఏడాది గడించింది. సమిష్టి రైతు యింటికి యీ పంటనంతట్నీ చేర్చడానికి చాలా లారీలు కావలసి వుంటాయి. మొత్తంమీద ఆయనకు ఇంచుమించు ఆరు టన్నుల ధాన్యమూ, 25.5 కిలో గ్రాముల వెన్న, స్వంత పశువులకోసం చాలా గడ్డి వచ్చాయి. ఇవికాక బురవ్‌ఛెంకో కుటుంబానికి 32,500 రూబుళ్ళ ధన రూపంలో వచ్చాయి.

ఈ ఏడాది మాస్కోకు ప్రదర్శనం చూడడానికి వచ్చే సమిష్టి రైతుల సంఖ్య బాగా హెచ్చింది. ఈ మహత్తర ప్రజా విశ్వ విద్యాలయ విద్యార్థుల సంఖ్య పెరుగుతోంది.

# సినీ విద్యాలయం

ఎన్. షబిలోవ్

అఖిల సోవియట్ సమాఖ్య వ్యవసాయ ప్రదర్శనోద్యానవనానికి సమీపంలో వున్న మహోన్నతమైన ఆ భవనాలు రెండూ, అఖిల సోవియట్ సమాఖ్యకు చెందిన ప్రభుత్వ సినీ విద్యాలయానివి.



పరీక్షల తర్వాత ఇండ్లకు తిరిగివస్తున్న విద్యార్థులు

ముప్పై అయిదు సంవత్సరాల క్రిందట ఈ విద్యాలయం స్థాపించబడినది. విదేశ జోక్యాలవల్ల రష్యా ఎంతో విధ్వంసం గావించబడినప్పటికీ, అన్నవస్త్రాల ఆవాసాల కొరత వున్నప్పటికీ, సోవియట్ ప్రభుత్వం సినీమాకు, ప్రజల యొక్క సాంస్కృతిక స్థాయిని పెంపొందించుటలో అది బలవత్తర సాధన కాగలదు కాబట్టి దానికి మహత్తర ప్రాముఖ్యాన్నిచ్చింది. ఎన్నో కష్టపరిస్థితు లున్నప్పటికీ, పై కారణంవల్ల ఈ విద్యాలయం నెలకొల్పబడింది.

ప్రారంభ దినాలనుండీ విద్యాలయంలో ఇప్పటికి ఎన్నో



"పిశాచం" అన్న కెర్మజాకోవ్ చిత్రంలోని ఒక పాత్రను అనుకరిస్తోన్న విద్యార్థి



"కెప్టెన్ కూతురు" అన్న చిత్రంలో మరియా ఇవనోవా పాత్రకు తీసుకోబడిన ఒక విద్యార్థిని

మార్పులు వచ్చాయి. ఒక చిన్న స్టుడియోలో నుండి సువిశాల భవనంలోకి మార్చివేయబడింది. ఇప్పుడీ విద్యాలయం ఉన్నత యోగ్యతలు గల చలనచిత్ర నిపుణులకు శిక్షణ యిస్తున్నది.

ఈ విద్యాలయ పట్టభద్రులు సోవియట్ దేశంలోనేకాదు, విదేశాలలో గూడా పేరు కెక్కారు: ఉదాహరణకు "భారతదేశపు అరుణోదయం" తీసిన ప్రసిద్ధ ఛాయాచిత్ర గ్రాహకుడు, దర్శకుడు ఆర్. కార్మెన్; నటీమణులు ఇజ్వేత్స్కయా, లరియొనోవా: నటులు బొందర్చుక్, రైబ్నికోవ్: సినేరియో రచయితలు పవవా, త్రైజనోవ్ మొదలైన వారిని పేర్కొనవచ్చు.



ఛాయాచిత్రగ్రహణ విభాగపు ఒక విద్యార్థిని ఆర్. ప్రహస్త్

"సోవియట్ సినీ నిర్మాతలలో "అగ్రగాములు", దర్శకులు అలెగ్జాండ్రోవ్, జి. ఇరాస్మోవ్, రోషాల్; ఛాయాచిత్ర గ్రాహకులు గొలొవ్న్యా, కొస్మతోవ్, ప్రసిద్ధనటుడు బెలొకురోవ్ మొదలైనవారు ఇప్పుడీ విద్యాలయంలో అధ్యాపకులుగా పనిచేస్తూ తమ అనుభవ పరి



జ్ఞానాన్ని యువ సహచరులకు పంచి పెడుతున్నారు. "చలన చిత్ర రహస్యాలను" వారికి విపులంగా విశదీకరిస్తున్నారు.

విద్యాలయంలోనే విద్యార్థులకు స్వీయ చిత్ర నిర్మాణశాలలు, ఛాయా గ్రహణ శాలలు, లైటింగ్, చిత్ర సంయోజన శాలలు, శబ్దగ్రహణ విభాగాలు, చలన-ఛాయాచిత్ర వస్తువులు, ప్రయోగ శాలలు, విద్యుద్దీకృత-సాంకేతిక పరిశోధనాలయం వున్నాయి. వీటితో పాటు చిత్ర పరిశీలనకు, చిత్రసమీక్షకు ఉపకరించే మూడు చిత్ర ప్రదర్శన శాలలు, 100,000 గ్రంథాలతో, ముఖ్యముగా సినీ సమస్యలకు సంబంధించిన ప్రత్యేక సారస్వతం, సినేరియోలు, చిత్రకళకు సంబంధించిన చిత్ర సంపుటాలున్న ఒక గ్రంథాలయం ఉన్నది.



సుప్రసిద్ధ చిత్రదర్శకుడు ఎస్. యూత్కెవిచ్ పాఠం చెబుతోన్న దృశ్యం

చలనచిత్ర కళకు సంబంధించిన ప్రత్యేక విషయాలతో బాటు, విద్యార్థులు కళా చరిత్ర, విదేశ భాషలను కూడా అభ్యసిస్తారు.

37 జాతులకు చెందిన విద్యార్థులకు యీ విద్యాలయం శిక్షణ నిస్తున్నది. భవిష్యత్తులో చలన చిత్ర నిర్మాణంలో చేరబోతున్న చైనా,





జిప్సిపినా, నటనా విభాగపు విద్యార్థిని



నీకెన్ని మార్కులొచ్చాయి

వియత్‌నామ్, పోలెండ్, ఆల్బేనియా, రుమేనియా, బుల్గేరియా, మంగోలియా ప్రజా రిపబ్లిక్, చెకొస్లొవాకియా మొదలైన దేశాల విద్యార్థులు ఈ ఉపన్యాసాలకు హాజరవుతున్నారు.

ఈ సినీ విద్యాలయాన్నిగురించి ఎంతైనా చెప్పవచ్చు, అయితే ఈ సంచికలో ప్రకటితమవుతున్న ఎం. మురజోవ్ ఛాయాచిత్రాలు ఆ పనిని ఇంకా బాగా చేస్తాయి.



భావి ఛాయాచిత్రగ్రాహకుడు, సినిమా ఉపకరణాలన్నింటి గురించీ బాగా తెలుసుకోవాలి.



హెమ్మింగ్‌వే కథానిక నాధారం చేసుకొని తీయబడుతున్న శిక్షణ చిత్రపు దృశ్యం. నిర్మాత, అఖిల సోవియట్ సమాఖ్యకు చెందిన ప్రభుత్వ సినీ విద్యాలయ విద్యార్థి ఎ. గొర్కొవ్‌స్కి.



చిత్రపు దృశ్యాలను పరిశీలిస్తోన్న భావి చిత్రగ్రాహకుడు

# మా పాఠకులు అడిగిన ప్రశ్నలు

ప్రశ్న: సోవియట్ దేశంలో ప్రతి రైతుకు, ప్రతి కార్మికుడికీ ఒక కారున్నదా?

సోవియట్ దేశపు ఆటోమొబైల్ పరిశ్రమ యొక్క ఉత్పాదక స్థాయి ఎంత?

జవాబు: విప్లవానికి పూర్వం రష్యాలో ఆటోమొబైల్సు ఉత్పత్తి చెయ్యబడలేదు ఆటోమొబైల్స్ మొట్టమొదట తయారు చెయ్యబడింది 1924 లోనే అప్పటినుండీ ఏటేటా రష్యాలో ఆటోమొబైల్స్ ఉత్పత్తి పెరుగుతూనే వుంది. 1956 లో 465 000 ఆటోమొబైల్స్ తయారుచెయ్యబడ్డాయి. (358,000 లారీలు 9,000 బస్సులు, 98,000 కార్లు). సోవియట్ దేశపు జనసంఖ్య 20 కోట్లకు పైబడిన దన్న విషయాన్ని విస్మరించనట్టయితే, ఇప్పుడు ఉత్పత్తి అవుతున్న కారుల సంఖ్య అతిస్వల్పమనీ, ప్రతి కార్మికుడికీ, ప్రతి రైతుకూ ఒక కారును కొనుక్కునే అవకాశం లేదనీ స్పష్ట పడుతుంది.

ప్రశ్న: ఆరోగ్య స్థావరాలు సోవియట్ దేశంలో ఎన్ని వున్నాయి?

జవాబు: 1955 లో సోవియట్ దేశంలో 2,178 ఆరోగ్య స్థావరాలు, 930 విశ్రాంతి గృహాలు వున్నాయి. వీటిలో 444,000 మందికి వసతి కల్పించ బడింది.

ప్రశ్న: సోవియట్ దేశంలో వైద్య సహాయం ఉచితంగా లభిస్తుందా?

జవాబు: సోవియట్ దేశమంతటా నగరాలలోను, పల్లెలలోను ప్రభుత్వ వైద్య చికిత్సా కేంద్రాలు (ఆసుపత్రులు, పోలీ క్లినిక్కులు సలహా, ప్రసూతి శరణాలయాలు) విస్తృతంగా నిర్మితమై వున్నాయి వాటిలో వివిధమైన వైద్య చికిత్సా సహకారాలు ఉచితంగా. లభిస్తాయి.

# అమెరికా కంటే సోవియట్ దేశంలో మరణ సంఖ్య తక్కువ

1956 లో సోవియట్ దేశ మరణ సంఖ్య 1913 నాటి మరణ సంఖ్యలో 25 ప్రతిశతి వున్నది అమెరికా సంయుక్త రాష్ట్రాలు, ఫ్రాన్సు మొదలైన దేశాలన్నిటికన్నా ఈ దేశపు మరణసంఖ్య చాలావరకు తగ్గినది. విప్లవ-పూర్వపు సంవత్సరాలతో పోల్చి చూచినట్టయితే సోవియట్ దేశంలో శిశు మరణాల సంఖ్య 83.3 ప్రతిశతికి తగ్గినది.

రోగ నివారణ చర్యల అమలు జరపడం వల్ల సోవియట్ దేశం ప్లేగు మశూచి, కలరా, పాం-టైఫాయిడ్ మొదలైన వ్యాధులనుంచి విముక్తం కావడమేగాక, కొన్ని వ్యాధులు అపరూపమై పోయాయి.

వైద్యవృత్తిలో వున్నవారి సంఖ్యనుబట్టి సోవియట్ దేశం ప్రథమస్థానాన్ని ఆక్రమిస్తున్నది. మహిళల, బాలల సలహా కేంద్రాలు సోవియట్ దేశంలో 1956 లో, 13 869 వున్నాయి. ఆ సంవత్సరంలోనే శిశు పరిపోషణాలయాలు, బాలోద్యానవనాలు 2 800 000 బాలలకు ప్రవేశాన్నిచ్చాయి. ప్రతి ఏటా 50 లక్షల సోవియట్ పౌరులు తమ సెలవు దినాలను 3,000 ఆరోగ్య మందిరాలు విశ్రాంతి శాలల్లో గడుపుతారు.

ప్రస్తుతానికి 268 పరిశోధనా సంస్థలు, 89 ఉన్నత వైద్య విద్యాశిక్షణా సంస్థలు సోవియట్ దేశ ఆరోగ్య మంత్రాంగ శాఖాధ్వర్యంలో పని చేస్తున్నాయి.

సోవియట్ పరిశ్రమ యాన్టి-పోలియోమైలిటిస్ వాక్సైన్‌ను తయారు చేసింది పెద్ద ఎత్తున వాక్సినేషన్ చెయ్యడంకూడా ప్రారంభమైంది అధికతర మవుతున్న ఈ వాక్సైన్ ఉత్పత్తివల్ల వాక్సినేషన్ కార్యక్రమం విస్తృతము కావడానికి వీలుకూడా చిక్కవచ్చు. ఈ టీకాల మందులను, సీరమ్‌లను తయారు చేస్తున్న సోవియట్ సంస్థలు, గ్రిప్పి రోగ నిరోధానికి ప్రత్యేకమైన టీకాల మందులను, విషపు నీటివల్ల లేక విషపు రసివల్ల వచ్చే గ్రిప్పి వ్యాధులకు టీకాల మందులను తయారు చేస్తున్నాయి.

సోవియట్ దేశంలో క్షయ నివారణకుగాను,



ఇటీవల మాస్కోలో జరిగిన పత్రికా విలేఖరుల సమావేశంలో ఈ అంశాలను విశదీకరించిన సోవియట్ దేశ ఆరోగ్య మంత్రిణి మరియా కొవ్రిగినా

స్ట్రెప్టొమైసిన్‌తో సహా అనేక మందులు ఉచితంగా యివ్వబడుతున్నాయి. ఆగస్టు 1వ తేదీ నుంచీ ముఖ్యమైన మందుల—స్ట్రెప్టొమైసిన్, పెన్సిలిన్ మొదలైనవాటి చిల్లరధరలు 30 ప్రతిశతిక పైగా తగ్గించబడ్డాయి.

# నవంబర్ 7, 1917

## ఎ. లునాచర్‌స్కీ

పీపుల్స్ కమిసార్, విద్యాశాఖ 1917 నుంచి 1929 వరకు

*ఈ స్మృతుల లేఖకుడు ఎ. లునాచరీస్కీ (1875–1933) ప్రముఖ రష్యన్ రాజకీయవేత్త, ప్రజానాయకుడు. పంధొమ్మిదవ శతాబ్దం అఖరున యీయన సోషల్-డెమొక్రాటిక్ ఉద్యమంలో చేరారు. ఈయన రష్యాలోని 1905 విప్లవంలో పాల్గొన్నారు. అక్టోబరు సోషలిస్టు మహా విప్లవం విజయంపొందిన తర్వాత ఈయన రష్యన్ సమాఖ్య విద్యాశాఖ పీపుల్స్ కమిస్సార్‌గా పన్నెండు సంవత్సరాలపాటు పనిచేశారు. ఈయన గొప్ప వక్త, ప్రచారకుడు, కళలు, సాహిత్యాల చారిత్రకుడు.*

....మా ఉద్దేశాలను మేము యేమాత్రము దాచిపెట్టుకోలేదు. ఫ్యాక్టరీలలోను, బారకాసులలోను మాట్లాడవలసివచ్చిన విషయం నాకు బాగా జ్ఞాపకమున్నది. మాసంస్థయొక్క నిర్నిబంధమయిన తోడ్పాటుతో, తాత్కాలిక ప్రభుత్వాన్ని వైదొలగమని మనం చెప్పేరోజులు ఆసన్నమవుతున్నాయనీ, అలా ఆ ప్రభుత్వం చేయకపోయినట్టయితే, మేమే వారిని తొలగించివేస్తామనీ నేను బహిరంగంగానే ప్రజలకు చెబుతూ వచ్చాను.

సోవియట్ల రెండవ మహాసభలో మాకు అధిక సంఖ్యాకబలం లభిస్తుందని మాకు గట్టినమ్మకం యేర్పడింది... సోవియట్ల మహాసభ అక్టోబరు మాసాంతంలో జరుగవలసిఉండినది. అందువల్ల సాయుధ తిరుగుబాటు యొక్క తేది దాదాపు ముందుగానే నిర్ణయమైపోయింది. కాని ఈ తిరుగుబాటుయొక్క తేదీని మరింత స్పష్టమైన పద్ధతిలో నిర్ణయం కావడానికి కొన్ని పరిస్థితులు కారణభూతమయ్యాయి. అకాలమైన చర్య గైకొనడంలో పాల్గొనడంవల్ల తాము నష్టపోతామేమోనని భయపడుతూవుండిన కొన్ని వర్గాలు పార్టీలో ఉండిన విషయం గుర్తుంచుకొనవలసి వుంటుంది. ఉదాహరణకు, వివిధ జిల్లాకు చెందిన ప్రముఖ కార్యకర్తల సమావేశంలో, ప్రజానీకం యొక్క విప్లవ స్వభావం అవసరమైనంతగా పరిపక్వం పొందలేదని అధిక సంఖ్యాకులు అభిప్రాయపడిన విషయం నాకు బాగా గుర్తున్నది.

కాని విదేశంలో అజ్ఞాత వాసంలో ఉన్న లెనిన్ ఇందుకు భిన్నంగా తొందరపడమని కోరుతూ వచ్చారు. ఈ అనుకూలమైన సమయం చేయిదాటిపోతుందేమోనని భయపడ్డారు. కెరెన్స్కీ ప్రభుత్వము బలహీనమైనదనీ, గందరగోళంలో ఉన్నదనీ స్పష్టమయింది. అయినప్పటికి, విప్లవం కొరకు బహిరంగంగా జరుగుతున్న సన్నాహాలను అది చూడకపోలేదు. ఆ మహాదినానికి ముందు అదిగైకొన్న చర్యలు—బాస్యూకోవ్ వంతెనలను యెత్తివేయడము, బాగా నమ్మకమైన సైనిక దళాలను సమీకరించడము, విప్లవాత్మక కమిటీలను చెదరగొట్టివేయడము, లేక అరెస్టుచేయడము—మేము చర్యకు ఉపక్రమించడానికి సంజ్ఞలుగా పనిచేసాయి. అక్టోబరు విప్లవమే ప్రజ్వరిల్లకపోయినట్లయితే బూర్జువావర్గం, మెన్షివిక్కుల ప్రభుత్వం ఎంత పనికైనా సరే, చివరికి పెట్రోగ్రాడ్‌ను జర్మన్ సైన్యాలకు అప్పగించడానికిగూడా సిద్ధమైఉండేదని ఖచ్చితంగా చెప్పవచ్చును. పెట్రోగ్రాడ్ నుండి విలువైన వస్తువులను తరలించడానికి, ప్రధానమయిన ఫ్యాక్టరీలను ఖాళీ చేయించడానికి కెరెన్స్కీ ప్రభుత్వం ఉత్తరవులను జారీచేసింది. ఎంతో ఆత్రంతో, హాస్యాస్పదమైన విధంగా అపని జరుపబడింది........

ఈ విధంగా పెట్రోగ్రాడ్ శ్రామికవర్గమూ, రక్షణ సేనలు రష్యా దేశమంతటా విప్లవాన్ని ప్రారంభించడానికేగాక, ప్రత్యక్షంగా తమకు యేర్పడిన ప్రమాదంనుండి కాపాడుకొనడానికి గూడా తిరుగబడ్డారు. కెరెన్స్కీ ప్రభుత్వం యొక్క "విశ్చితమైన చర్యలకు" తిరుగుదెబ్బగా బోల్షివిక్ విప్లవాత్మక కమిటీ తన శక్తులను చర్యలోకి దించింది. తర్వాత యేమిజరిగింది? పెట్రోగ్రాడ్‌లో రెండు సమానమైన అధికారంగల ప్రభుత్వాలు యేర్పడుతాయనీ, అవి రెండూ ఒకదానితో మరొకటి పోరాడుతాయనీ కొందరు అభిప్రాయపడ్డారు. అలాంటిదేమి జరగలేదు. జరిగిందేమిటంటే, అన్నివిధాల విప్లవాత్మక కమిటీయే ప్రభుత్వంగా రూపొందింది. కెరెన్స్కీ-రక్షణకు సమీకృతమైన శక్తులు పూర్తిగా నామావశిష్టమయ్యాయి. సాయం

త్రానికల్లా ఆశక్తులు, బూర్జువా ప్రభుత్వం ఆధిపత్యంలో ఉన్న ఒకే ఒకస్థలమైన వింటర్ ప్యాలస్‌కు చేరుకున్నాయి.

విప్లవాన్ని రక్తపాతం లేకుండా జరిపించడానికి విప్లవాత్మక కమిటీ తాను చేయగలిగిందంతా చేసింది. బ్రహ్మాండమైన అవాంతరాలు యెదురవడం మూలాన, సహజంగానే ఇలా చేయవలసివచ్చింది. మాస్కోలోని విప్లవంవలెగాక, పెట్రోగ్రాడ్‌లోని విప్లవం దాదాపు రక్తపాతం లేకుండానే జరిగిపోయింది. వింటర్ ప్యాలస్‌ను కైవశం చేసుకోడానికి జరిగిన పోరాటంలో మాత్రం కొద్దిగా కాల్పులు జరిగాయి, కాని మా పక్షంవారే గాయపడ్డారు.

కెరెన్‌స్కీకి రక్షకులుగా కొందరు స్త్రీలు, బాలలు నిలబడడం కొంత విచిత్రంగా కనబడుతుంది. ఒక "స్త్రీల సైనికదళము", కొందరు యువక సైనిక విద్యార్థులు వింటర్ ప్యాలస్‌ను రక్షించడానికి నిలబడ్డారు. పోరాటాన్ని మానవతా మార్గంలో నడిపించడానికి ఇదొక కారణమయింది.

పెట్రోగ్రాడ్ త్వరలోనే మామూలు పరిస్థితిని వచ్చింది. విప్లవంయొక్క గుర్తు లేసీ నగరంలో కనబడలేదు. వింటర్‌ప్యాలస్ పరిసర ప్రాంతంలో మాత్రం కొంత పోరాట వాతావరణం కనబడింది. సాయంత్రం, సరిగ్గా చెప్పాలంటే రాత్రి సోవియట్ల రెండవ మహాసభ ప్రారంభింపబడింది. వింటర్ ప్యాలస్ ఇంకా వశం కాలేదు. స్మోల్నీలోని కాలమ్స్ హాలులో ఒకటి తర్వాత మరొకటిగా తీవ్రంగా ఉపన్యాసాలు జరుగ సాగాయి.

బోల్షివిక్కులు క్రోధపూరిత ధోరణిలో మాట్లాడసాగారు, మెన్షివిక్కులు చిరాకుగాను బాధగాను మాట్లాడసాగారు. ఈ చర్యలయొక్క ఫలితాలు త్వరలో, ప్రధానంగా యుద్ధ రంగంలో కనబడుతాయని భయపెట్టసాగారు. కొందరు మెన్షివిక్కులు నా దగ్గరకు పరుగెత్తుకు వచ్చి "అరోరా" నౌక పెట్రోగ్రాడ్‌పైన తుపాకులు పేల్చుతున్నదనీ, వింటర్ ప్యాలెస్ కూలిపోతున్నదనీ, సెయింట్ ఇసాక్ చర్చిపైన కాల్పులు జరుగుతున్నాయనీ గోలపెట్టిన విషయం నాకు ఇప్పటికీ బాగా గుర్తున్నది. ఈ విషయాలన్నీ వినడం కొంత బాధగానే వున్నప్పటికి, మా ముందు ఒక కర్తవ్యం స్పష్టంగా వుండినది. వింటర్ ప్యాలస్‌ను విజయవంతంగా ఆక్రమించుకొనడమే ఆ కర్తవ్యం. కాని అసలు విషయం ఏమిటంటే మెన్షివిక్కులు చెప్పినవన్ని అబద్ధాలే. "అరోరా" నౌక తన తుపాకులను భయకంపితులైన పరిపాలకుల పైకి గురి చేసిందే కాని పెట్రోగ్రాడ్‌లోని యే నిర్మాణాన్ని పాడుచేయలేదు. వింటర్ ప్యాలస్‌పైన సైనిక చర్య అంతొనోవ్-ఓవ్‌సెయెంకో, పొడ్వోయిస్కీల అధ్వర్యంలో కొనసాగింపబడింది. దాదాపు ప్రతి పదినిముషాల కొకసారి వారు స్మోల్నీకి టెలిఫోనులో పోరాట పరిస్థితిని తెలియజేస్తూ వుండేవారు. ఈ లోగా హాలులో తీవ్ర వాదోపవాదాలు జరుగసాగాయి. ఒక పక్షంవారిలో ద్వేషము, భయము, రెండవ పక్షంవారిలో విజయోత్సాహము కనబడసాగాయి. గాట్చినా పట్టణం నుండి వచ్చిన ప్రతినిధులు, కెరెన్‌స్కీ ప్రభుత్వం తమ పరిసర ప్రాంతాలనుండి సైన్యాలను సమీకరించిందనీ, ఆ సైన్యాలు పెట్రోగ్రాడ్‌మీదికి రావచ్చుననీ తెలియజేశారు, ఆ తర్వాత, ఇట్టి ఉద్రిక్త వాతావరణం మధ్య, వింటర్ ప్యాలెస్ కైవశమయిందనీ, ప్రభుత్వ సభ్యులు అరెస్టు చేయబడ్డారనీ, కెరెన్‌స్కీ పారిపోయాడనీ వార్త వచ్చింది.

ఆ రాత్రి, మర్నాడు ఉదయమూ సంఘటనలు యే క్రమంలో జరిగాయో గుర్తుచేసుకోవడం ఇప్పుడు కష్టమనిపిస్తుంది. పెట్రోగ్రాడ్ రక్షణకొరకు ప్రథమచర్యలు గైకొనబడ్డాయి. విజయాన్ని తెలియజేస్తూ రష్యాఅంతటా టెలిగ్రాములు పంపబడ్డాయి. యుద్ధం చేస్తున్న రాజ్యాలతో సాధారణ శాంతికొరకు తక్షణం సంప్రదింపులు జరపడానికి వొరొవ్స్కీకి అధికారం ఇవ్వబడింది. కాని ఆనాటి రాత్రి జరిగిన సంఘటనలలో పాల్గొన్నవారెవ్వరూ అప్పటి వాతావరణాన్ని మరచిపోలేరు. అత్యంత ఉద్రిక్త వాతావరణం గడుస్తున్న ప్రతి నిముషంయొక్క బ్రహ్మాండమైన ప్రపంచ ప్రాముఖ్యతను గుర్తించిన ఉత్తేజం అందరిలో గోచరించింది.

అప్పటి ఉద్రిక్తత కొంత తగ్గిందన్నమాట వాస్తవమే అయినప్పటికి నిజానికి నేటికిగూడామనం అప్పటి చారిత్రక వాతావరణ దశనుండి ఇంకా బయట పడలేదు. మాస్కో భవిష్యత్తును గురించిన ఆందోళన, పెట్రోగ్రాడ్‌పైకి కెరెన్‌స్కీ పంపిన మొట్టమొదటి సైన్యాలతో తలపడడం, బ్రెస్ట్ శాంతి సంప్రదింపుల అవస్థలు, జర్మన్ల దాడి, ఇలాంటి అనేక ప్రమాదాలనుండి పరిస్థితి కుదుటపడింది, ఆ విప్లవం నాటి రాత్రి విడుదలైన మహత్తర సమీకృతశక్తి ఈ కష్టాలన్నింటిని అధిగమించగలిగింది. ఈ సమయంలో, పరిస్థితులను బాగా అర్థం చేసుకొంటూ, వాటికి అనువైన విధానాన్ని సూచిస్తూ, శరవేగంతో నడుస్తున్న సంఘటనలను ఒక మార్గాన్ని పట్టించిన వ్యక్తి వ్లాదిమీర్ ఇల్యిచ్ లెనిన్ అని అందరికీ అర్థమయింది. అందువల్లనే మహాసభకు అన్నిప్రాంతాలనుండి వచ్చిన బోల్షివిక్కుల మధ్య ఆయన అగుపడగానే అక్కడ కలిగిన ఉత్సాహానికి అంతు లేకపోయింది.

ఎవరైనా సరే ఆనందదాయకమైన ఆ శుభసమయాన్నిగురించి తలంచుకొన్నప్పుడు వారి స్మృతిపథంలో చిరునవ్వు నవ్వుతున్న లెనిన్ రూపం ప్రత్యక్షం కాకమానదు.

# మంచుబంతి భారతదేశానికి ఎట్లా వెళ్ళింది?



సోవియట్ బాలల రచయిత సెర్గీ బరుజ్దిన్ కథ

(గతసంచిక తరువాయి)

మాస్కోలో వున్నప్పుడే ఇగొర్ పెత్రోవిచ్, తన జంతువుల కోసం గిన్నెలను కొన్నాడు. ఒకొక్కదానికీ మూడు సామాన్యమైన లోహపు గిన్నెలివి; ఒకటి త్రాగేనీటికోసం, తక్కిన రెండూ ఆహారంకోసమూ.

"ఇది మీ సామాను!" అని ఇగొర్ పెత్రొవిచ్ తన జంతువులకు చెప్పాడు. "జాగ్రత్తచేసుకొండి."

కాని మంచుబంతి తన గిన్నెలను జాగ్రత్త చేసుకోలేదు. మాస్కోకూ, తాష్కెంటుకూ మధ్య అది ఒక గిన్నెను నమిలివేసింది. ఢిల్లీకి వెళ్ళే త్రోవలో రెండోదానిని పగలగొట్టింది. మూడోది బాగా గంట్లుపడిపోయింది, కాని యింకా అది నీరు పెట్టడానికి ఉపయోగపడుతూవుంది.

ఢిల్లీనుండి మద్రాసుకు ఎలుగుబంటిపిల్ల, ఉల్వేరైజా, పావురాలూ ప్రయాణీకుల బండిలోని సామాన్ల పెట్టెలో ప్రయాణం చేశాయి. మంచుబంతి బోను నేలమీద ఉంచబడింది, సూట్‌కేసులూ పెట్టెలూ, సంచులూ ఎత్తుగా పెట్టివున్న అరలకుదూరంగా. బోనుకు ప్రక్కగా ఒకి ఫేన్ పెట్టబడింది.

"దీనివల్ల యీఎలుగుబంటిపిల్లకు తనస్వస్థలంలో, ఉత్తరాదిని వున్నట్టుగా వుంటుంది" అన్నారు భారతీయులు.

రైలు ఆగిన ప్రతిచోటా మంచుబంతినీ, రోసానూ, పావురాలనూ చూడడానికి మనుషులు వచ్చేవారు. ఇగొర్ పెత్రోవిచ్, మద్రాసు జంతు ప్రదర్శనశాల జంతువైద్యుడు డాక్టర్ జాన్ ప్రక్క పెట్టెలో ప్రయాణం చేస్తున్నారు. ఈ బహూమతులనుతీసుకుని, వాటిని జంతుప్రదర్శనశాలకు తీసుక వెళ్ళడానికి డాక్టర్ జాన్ ఢిల్లీకి వచ్చారు. స్టేషన్లో రైలు ఆగినప్పుడల్లా ఇగొర్ పెత్రోవిచ్, డాక్టర్ జాన్ సామాను పెట్టెవద్దకు గబగబా వెళ్లేవారు.

మంచుబంతి గిన్నెలో డాక్టర్ జాన్ నీటిని నింపేవారు. మంచుబంతి దానిని వెంటనే త్రాగివేసేది. ఆ తరవాతనే అది తినడం మొదలుపెట్టేది.

చూడడానికి వచ్చేవాళ్ళు మంచుబంతికోసం రకరకాల తినుబడి వస్తువులు తీసుకవచ్చేవారు. రైలు ఆగినచోటల్లా పెద్ద గుంపులు సామాను పెట్టెను చుట్టుముట్టేవి. మంచుబంతి ఆకర్షణ కేంద్రమయ్యింది.

అవి యించుమించు భారత ద్వీపకల్పంలో యీ చివరనుండి ఆ చివరకు ప్రయాణం చేశాయి. చివరికి బెజవాడ, ఆ తరవాత మదరాసు రాబోతున్నాయి. కొన్నిగంటలు ప్రయాణం చేసిన తరవాత రైలు, ఒక పొలంలో వున్న సిగ్నలువద్ద ఆగింది.

"మన మిత్రుల దగ్గరకు వెళ్దామా? వాటికి నీళ్ళుకావాలేమో" అని చెప్పాడు ఇగొర్ పెత్రోవిచ్, డాక్టర్ జాన్‌తో. వాళ్లిద్దరూ సామాన్ల పెట్టెవేపు వెళ్ళారు. చివరిగిన్నెను ప్రశాంతంగా నములుతో మంచుబంతి బోనులో పడుకుని వుండడం వాళ్ళకు కనిపించింది. అది తదేక దీక్షతో వుండడంవల్ల, వాళ్ళను గమనించనే లేదు.

"అది చూడండి!" అని అరిచాడు ఇగొర్ పెత్రోవిచ్. "మంచుబంతీ, నీకు సిగ్గులేమా? నా పరువు తీస్తున్నావు!"

మంచుబంతి తల తిప్పింది, ఇగొర్ పెత్రోవిచ్‌వేపు కాస్త చూసి, మళ్ళీ గిన్నెను నమలడం సాగించింది.

డాక్టర్ జాన్ మందహాసం మాత్రం చేశారు. కొద్ది క్షణాలలో రైలు కదిలింది. ఒక గంటతరవాత బెజవాడ వచ్చింది. ప్లాట్‌ఫారం మీద పెద్దగుంపొకటి వుంది.

వాళ్ళడిగిన ప్రశ్నలకు డాక్టర్ జాన్, కండక్టర్ జవాబులు చెప్పారు. మంచుబంతి గురించి తెలుసుకోవలసిన విషయాలన్నీ యిప్పటికి వీళ్ళకి తెలిసిపోయాయి, ఆ ప్రశ్నలన్నిటికీ వాళ్ళు జవాబులు యివ్వగలిగారు.

మొదటి గంట కొట్టింది, ప్రయాణీకులు తమ పెట్టెలకు తిరిగి వస్తున్నారు. అప్పుడు కొందరు కుర్రవాళ్ళు నీటితో నింపిన టీకెటిల్స్ పట్టుకుని ప్లాట్‌ఫారంమీద పరుగెత్తుకుని వస్తున్నారు. వారు సామాన్ల పెట్టె తలుపు దగ్గరకు పరుగెత్తైరు.

డాక్టర్ జాన్ నవ్వారు. "ఎందుకన్ని?" అవి అయన అడిగారు. "నేను ఒక్కటె కావాలన్నాను!"

"నాది తీసుకోండి! కాదు. నాది తీసుకోండి! నాది మంచిది!" అంటూ కుర్రవాళ్లు అరిచారు. తమ కెటిల్స్‌ను ముందుకు చాచుతూ.



మీ ధృవ ప్రాంత సముద్రానికి ఏం ఈ వెన్నీళ్ళగుంట అంత తీసిపోయిందా?

డాక్టర్ జాన్ అన్నిటికంటె పెద్దదానిని ఎంచుకుని, ఆ కుర్రవాడికి కృతజ్ఞతను తెలిపారు. అయనప్రక్కను నిలబడివున్న ఇగొర్ పెత్రోవిచ్‌కు ఒకమాటకూడా అర్థంకాలేదు. కాని మాటలు లేకుండానే అంతా అయనకు అర్థం అయిపోయింది.

## తొలి పరిచయం

ఈ అసాధారణమైన కానుకలు పొద్దుపోయాక మద్రాసు జంతు ప్రదర్శనశాలకు వచ్చాయి.

మర్నాటి ఉదయం మంచుబంతి పెందరాడే నిద్రలేచింది సూర్యుడు ఆకాశం మీదికి వచ్చాడు కాని వేడి కిరణాలు దట్టమైన ఆకుల మధ్యనుండి ప్రవేశించలేక పోతున్నాయి. నేలమీద చాలా హాయిగా, చల్లగా వుంది.

మంచుబంతికి లేవడం యిష్టంలేదు. కాని దానిమీదపడిన నీటి జల్లు గాని కళ్ళు విప్పించింది. తాను బోనులో లేననీ ఒక నీటిగుంట ప్రక్కను యిసకలో పరున్నాననీ అప్పుడు తెలిసింది దానికి.

అది చాలా అలసిపోయి వుండడంవల్ల గతరాత్రి బోనులోనికి వెళ్ళలేకపోయింది.

మంచుబంతి దర్జాగా చాచుకుని నిలబడింది. అది నీటిలోనికి ప్రాకబోతూ వుండగా, ఒక వింత ప్రాణి దానికంట బడింది. అది ఆఫ్రికాకొంగ. ఈ కొంగ తన తలను ఆరాతి గోడకు పైగానిక్కించి, యీ ధృవమండలపు ఎలుగుబంటి పిల్లను వింతగా చూస్తోంది. అది ఎప్పుడూ యిటువంటి జంతువును చూళ్లేదు.

మంచుబంతికూడా యీ కొంగవంటి దానిని చూళ్లేదు. జంతు ప్రదర్శనశాల ఆవరణలో తాము స్వేచ్ఛగా విహరించామన్న సంగతి దానికి తెలియదు. నిజానికి మంచుబంతికి విసుగు కలగడం కంటె ఎక్కువ వింతనిపించికది. ఈ కొంగరూపం దానికెంతమాత్రమూ నచ్చలేదు.

ఇక కొంగ విషయం. ఎలుగుబంటి పిల్లలో విశేషమేమీలేదని తెలిసిపోగానే అది రెక్కలను టపటపా కొట్టుకుని, జంతు ప్రదర్శనశాలలో తన ఉదయకాల వాహ్యాళి కది బయలు దేరింది.

దగ్గర్లోనే ఒక ఏనుగు ఘీంకరించింది. సింహాలు జవాబుగా గుర్రుమన్నాయి. కాని మంచుబంతి వాటిని పట్టించుకోలేదు. మాస్కో జంతు ప్రదర్శనశాలలో యిటువంటి చప్పుళ్ళకది అలవాటి పడిపోయి వుంటుంది.

తనలాగే ఆశ్చర్యపోతున్న ఇంకొక కొత్త జంతువుతో పోరాటానికి సిద్ధంగావుంది ఆ మంచుబంతి



హటాత్తుగా "అర్రా! అర్రా! పంఛి-పంఛి:" అని దానికి తన తలమీదగా వినిపించింది. మంచుబంతి మీదికి చూసింది. ఆకుల మధ్యగా రెండు పచ్చని రామచిలుకలు కనిపించాయి. అవి ఉద్రేకంగా ముచ్చటించుకుంటూ దిగువకు, దానివేపుగా చూశాయి.

"అర్రా! అర్రా!" అందొకటి.

"పంఛి! పంఛి!" అని జవాబిచ్చింది ఒకటి.

అవి తమలో తాము పోట్లాడుకుంటున్నామేమోనని అనిపించ వచ్చును. కాని అవి కేవలమూ తమ పేర్లు చెప్పుకుంటున్నాయి పదే పదే.

మంచుబంతి నీటిగుంటవద్ద కెళ్ళింది. లోహపు పీపా చల్లని గొట్టాన్ని అది నాకిందో లేదో, కాయలు జల్లుగా నీటిలో పడ్డాయి. దానిమీద నీటిని జల్లిస్తూ, అది కుయ్యిమని గాభరాగా వెనుక కు గెంతింది.

రామచిలుకలు కూచొనివున్న కొమ్మమీద యిప్పుడు పెద్ద తోకలుగల రెండు బూడిదరంగు కోతులు కూచొని వున్నాయి. అవి వికారంగా ముఖంపెట్టి, మంచుబంతి మీదికి కాయలు విసిరాయి.

మంచుబంతి గర్జించింది. హటాత్తుగా ఒకకోతి ఒక కొమ్మకు తన తోకను చుట్టి నీటి గుంటమీదికి వ్రేళ్ళాడింది. అది నీటిలో పడి పోతుందని మంచుబంతి అనుకుందేమో. కాని కోతి పడిపోలేదు.



మద్రాసు జంతుప్రదర్శనాలయ ప్రేక్షకులకు ఆహ్లాదకరంగా మంచుబంతి ఎప్పటిలాగానే ఉత్సాహంగావుంది

అది ముఖం ముడుచుకుని, తన పసుపు పచ్చని పళ్ళను చూపుతూ మంచుబంతి వేపు పండ్లిగిలించింది.

మంచుబంతి కోతివేపు ధైర్యంగా చూసి, కోపంగా గర్జించింది.

తన రాజ్యాన్ని పరిశీలించుకున్న తరవాత, మంచుబంతి తిరిగి నీటిగుంట వద్దకు వచ్చింది. కాని అది తన జలవిహారాన్ని ఆపవలసి వచ్చింది. ఉదయాహారం రావడంవల్ల.

మద్రాసులో తొలి ధ్రువమండలపు ఎలుగుబంటి తొలి ఉదయాహారం తినడం చూడడానికి యించుమించుగా జంతు ప్రదర్శనలో పనిచేసే వారందరూ వచ్చారు. దాని అధిపతి రామానుజులు, డాక్టర్ జాజ సైతం మామూలుకంటె పెందరాళవచ్చారు. వాళ్ళతో ఇగొర్ పెత్రొవిచ్ కూడా.

దాని ఆహారంలో ఒక గొడ్డుమాంసంముక్క, కొద్దిగా చేపలూ వున్నాయి. వీటిని ప్రత్యేకంగా మంచుబంతికోసం నగరం బజారు నుండి తెచ్చారు.

మంచుబంతి పచ్చి మాంసాన్ని తొందర తొందరగా తినేసింది. చేపల దగ్గరికివస్తూ ఆశగా అది ఎముకల్ని నాకింది.

"చేపలు మంచుబంతికి చాలా యిష్టం" అని ఇగొర్ పెత్రోవిచ్ వివరించారు. "అదెప్పుడూ చేపల్ని ఆఖరుకు అట్టె పెట్టుకుంటుంది."

మంచుబంతి చేపలను తన ముక్కుతో మూచూసింది, తరవాత పంజాతో ముట్టుకుంది. తరవాత తిరగవేసింది, మళ్ళీ మూజూసింది, హటాత్తుగా పళ్ళెంలోనుండి బయటికి నెట్టేసి. దానిని నేలమీదికి విసిరేసింది.

"బహుశా తూర చేపలను యిది ఖాతరు చెయ్యదేమో" అన్నారు డాక్టర్ జాజ.

"ఇంతకు ముందర ఇది ఎప్పుడూ తూరచేపను తినలేద"న్నారు ఇగొర్ పెత్రోవిచ్.

(మిగత 40వ పుటలో)

వేడి దుర్భరంగా వుంది



# పిల్లల పెంపకంలోని మర్మం

## బి. అలెగ్జాండ్రోవ్

పిల్లల ప్రవర్తన, అలవాట్లు, ఆకాంక్షలు, ఆవశ్యకతలు ప్రధానంగా ఇంటివద్ద వారిని పెంచే తీరుమీద ఆధారపడి వుంటాయి.

బిడ్డ ప్రతిదీ తెలుసుకోవాలనే కుతూహలంతో, బంధువులు ఎట్లా ప్రవర్తిస్తున్నారు? ఇంట్లో వాళ్లు ఏది ఔను, ఏది కాదనుకుంటున్నారు? అవి, పరిసరాలను పరీక్షిస్తుంటాడు. అందుచేతనే తలితండ్రులే గాని, వయసువచ్చినవారే గాని బాలల భవిష్యత్తును రూపొందించడమనే గురుతర బాధ్యతకు లక్ష్య మివ్వవలసి వస్తున్నది. ఈ కర్తవ్య పాలనకై తమకై తాము కొన్ని నియమాలను పెట్టుకోవాలి, వాటిని పాలించాలి, ఆ నియమాల దృష్ట్యా నా పిల్లలకు నేను, వారి కర్తవ్య నిర్వహణలో ఆదర్శప్రాయకం కాగలుగుతున్నానా లేదా? నా విధ్యుక్త నిర్వహణలో నేను విశ్వసనీయంగా, సత్య చింతనతో, ఇతరుల పట్ల సౌహార్ద్రతతో వర్తిస్తున్నానా లేదా? అని ఎవరిని వారే ప్రశ్నించు కుంటుండాలి.

....అనస్తాస్యా నికొల్యేవ్నా ఒంటరిగా జీవితం గడుపు కొంటున్నది. ఆవిడ భర్త యుద్ధ రంగంలో మరణించాడు. పిల్ల లిద్దరూ పెద్దవాళ్ళయి, స్వగ్రామానికి దూరంగా ఉద్యోగం చేసుకుంటున్నారు. ఒకరోజు, పొరిగింటావిడ, మరియా పెత్రోవ్నా ఆమెను చూడడానికి వచ్చి, జ్వరంతో నికొల్యేవ్నా బాధ పడుతుండడం చూచింది. మరియా ఇంటికి వెళ్ళి, తన కొడుకును పిలిచి "గ్రీషా! అత్తయ్య నాస్తియాకు జ్వరం తగిలింది, ఆవిడకు కాస్త నీళ్లు తెచ్చి పెట్టి, ఆవుకు మేత వేసి, వాళ్ళ పందులకు కాస్త ఆహారం పెట్టిరా" అని చెప్పింది.

ఆ పిల్లవాడు, తల్లి ఆజ్ఞను మనఃపూర్వకంగా పాటించి, ఆపని చేశాడా, లేదా అన్నది కాదు ముఖ్యమైంది. పొరుగువారికి ఆపద కలిగినప్పుడు, సాయం చెయ్యాలన్నది. ఆ పిల్లవాడు తెలుసుకొనడం అతి ముఖ్య విషయం.

నిజానికి తల్లికి, తన బిడ్డను బుద్ధిమంతుడు కాగలిగేట్టు, సౌహార్ద్రి వర్తనుడు కాగలిగేట్టు పెంచడం అంత కష్టమైన విషయం కాదు.

బిడ్డ ప్రవర్తనలో శుష్కాడంబరాలకు చోటు ఇవ్వకుండా జాగ్రత్త తీసుకోవాలి. బిడ్డ తన వస్తువులను, మనఃపూర్వకంగా అన్నదమ్ములతో, అక్కచెల్లెళ్ళతో పాటు ఉపయోగించుకునేట్టు చూడాలి. బిడ్డను అప్పుడప్పుడు ఒక స్నేహితుడి దగ్గరకు పంపుతూ, ఆ స్నేహితునికి ఏదైనా ఇబ్బంది కలిగినప్పుడు అతనికి సాయపడేట్టు సముచిత శిక్షణ యిస్తుండాలి. కాగా తల్లి తన బిడ్డ, వికలాంగులైన (నత్తి, కుంటి వచ్చినవాళ్ళు) ఇతర బాలల చూచినప్పుడు, పరిహాసం చెయ్యనివ్వకూడదు. ఈ విధంగా శ్రద్ధ తీసుకోబడుతున్నట్టయితే బిడ్డకు క్రమక్రమంగా తెలివితేటలు రావడమే గాకుండా సద్వర్తన అలవడుతుంది, ఉత్తముడో, ఉత్తమురాలో అవుతుంది.

తరచు, స్త్రీలు నలుగురు కూడి, పొరుగువాళ్ళ ముచ్చట్లు చెప్పుకుంటుంటారు. తమ చుట్టుప్రక్కల వున్న ప్రతివ్యక్తిని గురించీ మాట్లాడుకుంటారు. అటువంటప్పుడు వారు, తమ కబుర్లు ప్రక్కనే వున్న పసివాళ్ళు వింటున్నారన్న విషయం తరచు మరచిపోతుంటారు. మాట్లాడుకునే ప్రతిదీ, తమ పిల్లల చెవిన పడరాదన్న మాటను ఆ తల్లులు విస్మరిస్తారు. ఇట్లాంటి కబుర్లు విన్నతర్వాత, ఏ బిడ్డ అయినా, పెద్దవాళ్ళ గురించి తృణీకారంగా, మొరటుగా మాట్లాడితే ఆశ్చర్యపడ నక్కరలేదు. ఎందుకంటే అటువంటి నిందాపూర్వక భాషణ ఆ బిడ్డ తమ ఇంటివద్దనే విన్నది కాబట్టి.

పిన్న వయస్సులోనే తలితండ్రులు తమ బిడ్డలను పెద్దలను గౌరవించాలన్న దృష్టి కలిగించాలి. ఇది వారి విధి. కాగా తమ పిల్లలు, పెద్దలపట్ల తిరస్కార సూచకంగా ప్రవర్తించడాన్ని సహించకూడదు. పెద్దలంటే వినమ్రతతో మెలగడం పిల్లలకు చిన్నప్పుడే నేర్పాలి. సినిమాలకు, క్లబ్బులకు పోయినప్పుడు పెద్దవాళ్ళు వస్తే తమ స్థానాలను పిల్లలు, ఆ పెద్దలకిచ్చే అలవాటు చెయ్యాలి. క్యూలల్లో నిల్చున్నప్పుడు, పిల్లలు పెద్దలను త్రోసుక పోనివ్వరాదు. చేబరువులతో అలసిన ఒక స్త్రీకిగాని, వృద్ధుడికిగాని కాస్త చేయూత నివ్వడం పిల్లలకు అలవర్చాలి, మూడవ ఏటినుంచీ లేదా అయిదవ ఏటినుంచీ బిడ్డకు తలితండ్రులు ఈ విధంగా నీతి గరపుతున్నట్టయితే పెద్దయ్యే కొద్దీ బిడ్డకు వినమ్ర స్వభావం కలిగి సర్వజనానురంజకుడు కాగలుగుతాడు.

ఉదాహరణకు, అన్నా ఫైదరోవ్నా గొలవనోవాను తీసుకోండి. ఆవిడకు ముగ్గురు పిల్లలు. ఆవిడవాళ్ళకు తను పనినుంచి తిరిగి వచ్చే టప్పటికి గది పరిశుభ్రంగా వుంచమనీ, గిన్నెలు, కంచాలు శుభ్రంగా కడిగి పెట్టమనీ, భోజన పదార్థాల వేడివేడిగా వుండేట్టు చూడమనీ, పొయ్యిమీద నీళ్ళ కెటిల్ మరగవిస్తుండమనీ చెబుతుంది. ఆవిడ వాళ్ళు తను చెప్పిన ప్రతిపనీ చేసేట్టు చూస్తూ. దీనివల్ల వాళ్ళలో ఒకవిధమైన శ్రద్ధ, పనిలో మెళకువ, తన మాటంటేనే కాదు, పెద్దవాళ్ళ మాట వినాలనే లక్ష్యం ఏర్పడేటట్టు చేస్తుంది.

క్రమబద్ధంగా పిల్లలను ఇంటివద్దన పెంచడం, తల్లి యొక్క విద్యాయోగ్యతలమీద, ఎన్నేళ్ళు ఆవిడ పాఠశాలలో చదువుకొన్నదన్న దానిమీద ఆధారపడి వుండదు.

అనుభవంలో పరమ ప్రయోజనకారిగా గుర్తించబడిన స్వర్ణ సూత్రం ఒకటి వుంది. దానిని అనుసరించినట్టయితే ఎప్పుడూ పిల్లల్ని చక్కగా పెంచవచ్చు. ఆ సూత్రం: వీలయినంత ఖచ్చితంగా పిల్లలతో పని తీసుకోవడం, పిల్లలపట్ల వీలయినంత గౌరవాన్ని చూపడం. ఖచ్చితంగా వుండడంతోబాటు తలితండ్రులు పిల్లలపట్ల ఎంతో శ్రద్ధాళువులై వుండాలని దీని అర్థం. మంచి విషయాలు బలవంతంగా పిల్లల హృదయాలకు పట్టేట్టు చెయ్యడం అసాధ్యమని కూడా గుర్తుంచుకోవాలి. బెదరింపులు, కోపగింపులు ఏమాత్రం పని చెయ్యవు.

తలితండ్రులు పిల్లల్ని ఒకసారి బెదిరించి, వాళ్ళు ఏదైనా ఒక

(మిగత 40వ పుటలో)

# సోవియట్ దేశ
# ఉన్నత విద్యాప్రదర్శన



మద్రాసులోని రాజాజీ హాలులో ఏర్పాటుచేయబడిన ప్రదర్శన దృశ్యం

భారత-సోవియట్ సంస్కృతీ సంఘం సహకారంతో "ఒక్స్" సంస్థ "సోవియట్ దేశంలో ఉన్నత విద్య"ను గురించి ఒక ప్రదర్శనను 1957 జూలై 27వ తేదీనుంచి ఆగస్టు 7వ తేదీవరకు మద్రాసు రాజాజీ హాలులో యేర్పాటు చేసింది. మద్రాసు రాష్ట్ర ఆర్థిక మంత్రి శ్రీ సి. సుబ్రహ్మణ్యం ఈ ప్రదర్శనను ప్రారంభించారు.

మొదటి మూడు రోజుల్లో పదివేల మందికి పైగా ఈ ప్రదర్శనను సందర్శించారు.

(1) 1957 జూలై 24వ తేదీన ప్రదర్శనను చూచే భాగ్యం నాకు కలిగింది. పాఠశాలల బాలలకు, కళాశాల విద్యార్థులకు ఈ ప్రదర్శన ఉపయోగకరమైన విజ్ఞానాన్ని ఇస్తుందని నేను ఆశిస్తున్నాను.

కమలాంబుజం, ఎమ్. ఎల్. ఏ. 29-7-57.

(2) సోవియట్ రష్యా నుండి ఈ మధ్యనే తిరిగి వచ్చిన నాకు సోవియట్ ప్రజలంటే అత్యంత ప్రేమ, వాత్సల్యాలు ఉన్నాయి. విద్యార్థుల జీవితాన్ని చిత్రించడానికి ఈ ప్రదర్శన ప్రయత్నిస్తున్నందుకు నాకు సంతోషంగా వున్నది. ఇది మంచి ప్రయత్నం.

మన్‌మోహన్ కృష్ణ,
సినీనటుడు, 28-7-57.

(3) ప్రజల దృష్టికి ఈ సమాచారమంతా తేబడుతున్నందుకు నాకు ఆనందంగా వున్నది. ఇది భారతీయ విద్యార్థులకు మార్గదర్శకంగా వుండి, వారు మంచి భవిష్యత్తుకు ప్రగమించేటట్లు చేయగలుగుతుంది.

ఏ. ఎమ్. రామన్,
28-7-57,



మద్రాసు రాష్ట్ర ఆర్థిక మంత్రి శ్రీ సి. సుబ్రహ్మణ్యం, ప్రదర్శనా విష్కరణానికి పూర్వం, ఒక సమావేశంలో ప్రసంగిస్తోన్న దృశ్యం. ఛాయాచిత్రంలో శ్రీమతి ఖెద్కార్, సోవియట్ రాయబార కార్యాలయ ప్రథమ కార్యదర్శి శ్రీ వి. యస్. మొస్కలోవ్ లను చూడవచ్చు

(4) "ప్రపంచంలోని మానవులమైన మనమందరము సోదరులము. మనం ఒకరినొకరం అర్థం చేసుకొని, మైత్రినీ, అభ్యుదయాన్నీ, శాంతినీ సాధిద్దాము. ఒకరికొకరం అండగా నిలుస్తూ, ఒకరిని గురించి మరొకరం తెలుసుకొన్నప్పుడే యిది సాధ్య మవుతుంది.

"ఈ 'సోవియట్ విద్యా ప్రదర్శనం' సోవియట్ దేశంలోని విద్యావిధానాన్ని గురించి తెలుసుకోడానికి తోడ్పడుతుంది. ఇది చూచి నాకు చాలా ఆనందం కలిగింది. భారత-సోవియట్ సంస్కృతీ సంస్థకు నా కృతజ్ఞతాభివందనలు. మన ఉభయదేశాలను ఇంకా సన్నిహితంగా తీసుకురావడానికి ఈ సంస్థ ఇంకా యెక్కువగా పాటుపడ గలదని ఆశిస్తున్నాను."

(సంతకం) సహాయ
కార్యదర్శి (సాంస్కృతిక),
దక్షిణ రైల్వే
సాంఘిక, సాంస్కృతిక
సంఘం, మద్రాసు.

ప్రదర్శనాలయ అంతరదృశ్యం



(5) "సోవియట్ దేశ ప్రజలు బాగా కష్టపడి పనిచేస్తారని పేరు గడించారు. అన్ని రంగాలలోను అభ్యుదయాన్ని సాధించారు. భారత దేశం, సోవియట్ దేశాల మధ్య మైత్రిని పెంపొందించడానికి మేము పాటుపడుతాము."

(సంతకం) హెన్రీ, 29-7-57.

## మంచుబంతి భారతదేశానికి ఎట్లా వెళ్ళింది ?

(37వ పుట తరువాయి)

"దీనికి యింకోరకం చేప నిస్తా"నన్నాడు జంతుప్రదర్శనశాల అధిపతి.

కాని తూరచేపను బయటికి తియ్యటానికి డాక్టర్ జాజా బోనును సమీపించేసరికి, మంచుబంతి దానిని పళ్ళతో కరచి పట్టుకుని గర్జించింది. దానిని బోను అవల చివరికి యీడ్చుకుని వెళ్ళి, తినడం మొదలు పెట్టింది. చేపను యిచ్చెయ్యడమే !

## మద్రాసునుండి ఉత్తరం

ఇగోర్ పెత్రోవిచ్‌కి యిటీవల మద్రాసునుండి ఒక ఉత్తరం వచ్చింది. అందులో యిలా వుంది :

"ప్రియమైన ఇగోర్ పెత్రోవిచ్.

గౌరవనీయ మిత్రమా, ఒక కొత్త వ్యక్తినుండి యీ ఉత్తరం వచ్చినందుకు ఆశ్చర్యపడవద్దు. నేను మద్రాసు జంతు ప్రదర్శనశాలకు తరచుగా వెళ్తుంటాను. పావురాలనూ, ఉల్వెరైన్ రోసానూ, ధ్రువ మండలపు ఎలుగుబంటి మంచుబంతినీ భారతదేశానికి మీరు తీసుకవచ్చి ఒక సంవత్సరం అయ్యింది. ఈ బహుమతులను తెచ్చినందుకు మీకు మళ్ళీ కృతజ్ఞతను తెలుపుతున్నాను. అవి బ్రతికి వున్నాయి, ఆరోగ్యంగా వున్నాయి. పావురాలు పిల్లలుకూడా పెట్టాయి. ఇప్పుడు ఆరల్లా పన్నెండయ్యాయి.

మంచుబంతి గురించిన విశేషాలలో మీకు ఆసక్తి ఎక్కువ. ధ్రువప్రాంతపు ఎలుగుబంట్లకు ఉత్తరాలు వ్రాయడం చేతనయితే, మంచుబంతి తానే వ్రాసి వుండేది. భారతదేశంలో తన జీవితం గురించి చెప్పివుండేది. అది వ్రాయలేదు గనక, నేను వ్రాస్తున్నాను. దాని తరపున.

మంచుబంతి చాలా పెరిగిందనీ, యిప్పుడది యించుమించు పూర్తి ప్రమాణంలో వుందనీ చెప్పడానికి నాకు సంతోషంగా వుంది. మా శీతోష్ణ పరిస్థితిలో అది సుఖంగా వుందనడం సరికాదు. కాని మా వడగాడ్పుల రోజుల్లో అది గొప్ప ఓర్మినీ, సహనాన్నీ చూపుతోంది. చన్నీళ్ళు మంచిపని చేస్తాయి. మంచుబంతికి చన్నీళ్ళంటే యిష్టం. జంతు ప్రదర్శనశాల పనివాళ్ళు గుంటలోని నీటిని దానికోసం ప్రత్యేకంగా చల్లార్చుతారు.

మంచుబంతిని ఎక్కడ, ఎలాగ పట్టుకున్నదీ మేము తెలుసుకున్నాం. ధ్రువప్రాంతపు ఏలుగుబంట్లను పట్టుకునే సోవియట్ బాల బాలికలందరికీ మాపిల్లలు అభినందనాలను పంపుతున్నారు, ముఖ్యంగా మంచుబంతిని పట్టుకున్న చిన్న కుర్రవానికి.

మద్రాసు జంతు ప్రదర్శనలోని జంతువులన్నిటికీ మంచుబంతి అంటే ఎంతో గౌరవమనీ, అవి దానిని చాలా మర్యాదగా చూస్తున్నవనీ చెప్పదలుచుకున్నాను. దాని ప్రక్కకు యింకో ధ్రువప్రాంతపు ఎలుగుబంటి త్వరలో రాగలదని వారంతా ఆశిస్తున్నారు. మంచుబంతికి ఒంటరితన మనిపిస్తుందేమోనని వారు భయపడుతున్నారు. జంతు ప్రదర్శనశాల ప్రేక్షకులంకూడా అదే అనుకుంటున్నాం. మమ్ములను చూడటానికి తొందరగా రండి !"

—యం. నటరాజన్

(సమాప్తం)

---

## పిల్లల పెంపకంలోని మర్మం

[38వ పేజీ తరువాయి]

పని చేసేట్టు చేస్తే, మళ్ళీ ఇంకోసారి వాళ్ళచేత పని చేయించాలంటే చెయ్యి చేసుకోవలసి వస్తుందన్న విషయం మరచి పోకూడదు. బెదరింపులు, దెబ్బలు కాలం గడిచినకొద్దీ మొద్దుబారి పోతాయి. అందుచేత బాలల పెంపకంలో బిగ్గరగా అరవడం, తిట్టడం, బెదరించడం, అసలు కొట్టడం పనికిరాదు. వీటికి త్వరగా పిల్లలు అలవాటుపడి, అది వారికొక వ్యసనంగా మారుతుంది; కాబట్టి వీటికి తావివ్వకుండడం మంచిది.

తలితండ్రులు పిల్లల విషయంలో ఖచ్చితంగా వుండడం మాట ఒకటి, మొరటుగా వుండడమనేది ఇంకొకటి. ఏ బిడ్డనయినా ప్రతి స్వల్పమైన తప్పుకు—చీవాట్లు పెట్టి, బెదిరించి, దెబ్బలు కొడుతున్నటయితే దానివల్ల రాగల సత్ఫలితమేమీ వుండదు. దీనివల్ల కలిగేదల్లా శత్రుత్వమే. అట్లా శిక్షించే తలితండ్రుల పిల్లలు, ఇంటిదగ్గర అతి వినయంగా, శాంతంగా వున్నప్పటికీ వాళ్ళ ఇంట్లోనుంచి బయట పడ్డ తర్వాత, బళ్ళోను, బహిరంగ ప్రదేశాలలోను ఎంతో మొరటుగా కట్టడి తప్పి యెంతో అవిధేయతలో ప్రవర్తిస్తుంటారు.

తమ పిల్లలకు మంచి నడవడి అలవడాలనుకునే తలితండ్రులు వారికి సముచితమైన గౌరవాన్నిస్తూ, అదే సమయంలో కచ్చితంగా వుంటుండాలి. బాల్యంనుంచీ పిల్లలకు పరిశుభ్రత, పొదుపరితనం, ఇంటి పనులలో సాయపడుతుండడం, సహచరులతో తెలివిగా మెలగడం, పెద్దలను గౌరవించడం, బాగా చదువుకోవడం మొదలైన సుగుణాలు అలవరచాలి. తల్లిగాని, తండ్రిగాని వయసు వస్తున్న బిడ్డను—"ఇదిగో చూడు, నిన్ను నేను ప్రేమిస్తున్నాను, గౌరవిస్తున్నాను అందుకనే నువ్వు సత్యవర్తనతో మెలగాలి, బాగా చదువుకోవాలి, బాగా కష్టపడి పనిచెయ్యాలి, పెద్దలను గౌరవించాలి; నీ ఆత్మాభిమానాన్ని, సోవియట్ పౌరునిగా దేశాభిమానాన్ని, కుటుంబ ప్రతిష్టను కాపాడుకోవాలి !" అని హెచ్చరించవచ్చు. తలితండ్రుల ప్రేమ అధికారంతో అడుగడగినది—ఇందులోనే వుంది పిల్లల పెంపకంలోని పరమ రహస్యం.

భారత దేశంలోని సోవియట్ రాయబార కార్యాలయ సమాచారశాఖ తరపున, జి. ఎఫిమోవ్‌చే 25, బారాకంబా రోడ్, న్యూఢిల్లీ నుండి సంపాదితము, ఎన్. కె. దొరొద్నిత్సిన్‌చే ముద్రితము, ప్రచురితము. ముద్రాపకులు : పంజాబీ ప్రెస్, సదర్ బజార్, ఢిల్లీ—6.:

